నిష్కాపట్యయు

దైవభక్తి పరతంత్రురాలును

శాంతి శమదమాది సద్గుణవతియు

ప్రేమాకారమును

అయిన

# వేంకమాంబ

మజ్జనని

పాదారవిందములకు

కృతజ్ఞతాపూర్వకముగ

జన్మసాఫల్యార్థము

సమర్పితము

# విన్నపము



నేను చదువను వ్రాయను నేర్చిననాఁటంగోలె మాతృభాషయగు నాంధ్రభాషయందు నాదరము మెండుగనుండి సదా తెలుఁగు గ్రంథముల పఠించుచుండెడివాఁడను కాని యది పల్లెటూరి విద్యయగుటచే రాణింపునకు వచ్చియుండలేదు అంతట ఇంగ్లీషు విద్యాభ్యాసమునకై 1900 సంవత్సరములో హైద్రాబాదునకు వెళ్లి అచ్చట దొరతనమువారి యున్నతపాఠశాల (Government High School) లో ఇంగ్లీషునకు తోడుగ క్రమమయిన శిక్షతో తెలుఁగు నేర్పుచుండుటచేతను, ఆంధ్రభాషాభివృద్ధికై తమ జీవితమునంతయు నర్పించి నట్టియు, మాతృభాషాభిమానముం గూర్చి యనవరతము బోధించుచుండినట్టియు రావిచెట్టు రంగారాయమహాశయునిగృహమున నేను పెరుగుచుండు కారణంబునను, కన్నుల పండువుగానుండిన శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమును పలుమారు సందర్శించుచుండు కతంబునను, ఆంధ్రభాషయందలి ప్రీతి నామనమునం దతి దృఢముగ నాటుకొనెను

ఇంతలో శ్రీవిజ్ఞానచంద్రికామండలివారియనుగ్రహమువలన మద్రాసునకు (11-4-1909) వచ్చి మండలి కార్యాలయములో లేకరిగానుండు భాగ్యము లభించెను నిరంతరమాతృభాషా

సేవాత్మకుఁడనగు నాకీ యుద్యోగమువలన పలువురుపండితుల సహవాసమునకును, విద్యాగోష్ఠికిని నెక్కువ యవకాశము కలిగెను అంత గ్రంథములు రచించవలె నను కుతూహలముకూడ నానాఁటికి ప్రబలసాగెను

మన లోపాలోపముల నవరించుకొనుటకు మహాపురుషుల జీవితములు దర్పణము వంటివి ప్రజల యందు దేశభక్తిగాని, సంఘసంస్కరణాభిలాషగాని, వేదాంత విచారము గాని, భాషాభిమానము గాని, నీతిధైర్యము కాని నెలకొల్పుటకు సత్పురుషులచరిత్రలు తోడ్పడినట్లు ఏగ్రంథమును తోడ్పడదు

జీవచరిత్రపరనము ఉత్సాహములేనివానికి యుత్సాహము పుట్టించును, ఔన్నత్యాసక్తి లేనివారికి యున్నతభావములను జనింపఁజేయును ఇంతియేగాక గురువువలె ఉపదేశముచేయును, తండ్రివలెబోధించును, మిత్రునివలెసలహానిచ్చును, భార్యవలె తోడ్పడును. ప్రపంచయాత్రాసందర్భమున ఆయాఘట్టముల యందు మహానుభావుల జీవితములలోని విషయముల మన మార్గదర్శకముగ నుంచుకొంటిమేని యవి మార్గమును నిష్కంటకముగఁ జేయుననుటకును, మనశ్శాంతికి సహకారియగు ననుటకును ఎంతమాత్రము సందియము లేదు ఇట్లు దేశాభ్యుదయమునకుతోడ్పడునవి గావుననే మహాపురుషులజీవితము లేదేశమందును, ఏభాషయందును, ఏకాలమందును, పఠనీయములు'

ఇతర భాషలలోవలె ఆంధ్రభాషయందు జీవచరిత్రలు చాలతక్కువ ఉన్నవానిలో పరమార్థమునుగూర్చియు సంఘ

సంస్కరణమును గూర్చియు పాటు పడినవారి జీవితములు మెండు కావున దేశముయొక్క ఆర్థికసంపదభివృద్ధికై తోడ్పడిన రాజకీయవిజ్ఞాతల చరిత్రరచన ఎక్కువయావశ్యకముగా నాకు కన్పట్టె అందు కాంగ్రెసు వంటి మహాసభాధ్యక్షుల జవితములు మిగుల సంస్మరణీయములు గదా ?

ఇట్టి యూహాలతో నా చిత్త ముఱ్ఱూత లూగు చున్నను నాకుంగల భాషాజ్ఞానముకొలందియని తెలిసియు, ఇప్పు గ్రంథ రచనకుం బూనుట సాహసమని యెంచియు విమర్శనమన్న నేమియో నెఱుగక గ్రంథిక ర్తల కృత్యాలము చేయం గడంగు విమర్శకులకు జడిసియు నా యుద్దేశములను ఆచరణ లో పెట్టుటకు జంకుచుంటిని

ఇట్లుండ ఇప్పుడు విజ్ఞానచంద్రికామండలీ సభ్యులును, రసాయనశాస్త్ర గ్రంధకర్తయును మన్మిత్రులును అగు శ్రీయుత వేమూరి విశ్వనాధశర్మ ఎం ఏ గారొకనాడు నేను ఇచ్చటి సుంకువారి యగ్రహారములోనుండగావచ్చి ఏమయినవ్రాయు చుండుట భాషాజ్ఞానాభివృద్ధిం జేసికొనుటకు సులభమార్గ మని చెప్పి ఏమయిన వ్రాయ నన్ను ప్రోత్సాహ పరిచిరి నాకు చిరకాలము నుండి యున్న కుతూహలమునకును శ్రీ శర్మ గారియాలోచనమునకును సరిపోయినందున వారిప్రోత్సాహ మునేడుంతకట్టుగాంగొని 'జీవితచరితావళి' యనుపేరుతో రాజకీయవిషయములలో పనిచేసి దేశసేవ సలిపిన పురుషసింహుల చరిత్రలు వ్రాయ నుద్యమించితి ఇంతమాత్రము చేత వేఱువిధముగా దేశ రాధనచేసినవారు నాకుపూజనీయులు గారనియు

వారిజీవితము లీయావలి యందు ప్రచురింపఁబడ వలయు చదువరులు దలంపకుందురు గాక!

ఇట్లు కృతనిశ్చయుఁడనై నాకుఁగలస్వల్పజ్ఞానముతో కాంగ్రెసుప్రథమనాయకుఁడగు ఉమేశచంద్రబనర్జి జీవితము వ్రాయ కడంగి **1910**-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో దానిని ముగించితిని అప్పుడే దానినచ్చువేయ వలెనను ఇచ్ఛ లేనందున అది యట్టులేయుండెను

నేను ఉమేశచంద్రబనర్జి జీవితమును వ్రాసితి నని మత్పోషకులుగానుండిన శ్రీరంగారావుగారికిఁ దెలిపినప్పుడు ఆ మహాపురుషుఁడు మిగుల సంతసించె నఁట! కాని నాభాగ్యదోషమున వారికి నాప్రథమ ప్రయత్నమును చూపించి వారి యాశీర్వాదముం బడయ నోచుకొనలేకపోతిని గదా యని మిక్కిలి వగచుచున్నాను అకాలమృత్యుదేవత నామహాభాగుని తన కెరగాఁ జేసికొనుటయు, విజ్ఞానచంద్రికామండలి వారిప్రోత్సాహము కతన రంగరావుగారి జీవితమును నే వ్రాసి ప్రకటించుటయు ఆంధ్రవాచక ప్రపంచమునకుఁ దెలిసిన విషయములే

రంగరాయజీవిత ప్రచురమువలన నాకుమఱింత ప్రోత్సాహము కలిగెను ఆంధ్రభాషయందుమహాపురుషుల జీవితములు బహుస్వల్పముగ నున్నందున 'ఉమేశచంద్రబనర్జీ'ని అచ్చువేయించ మని నామిత్రు లనేకులు నన్నుకోరిరి

రంగారాయ జీవితమునకును, ఉమేశచంద్రబనర్జి జీవితమునకును జోడుగ గ్రంథమంతయు నూరుపుటలలో వచ్చునట్లు మఱియొక జీవితము వ్రాయనుద్యమించితి అదియే రమేశచం

ద్రుని జీవితము దేశాభిమానమందును, రాజనీతి కౌశల్యమందున, సాహిత్య విజ్ఞానమునందున, ఇంకననేక విషయములయందును ననుపమానుఁడై భరతఖండవ్యవహారగగనంబున షోడశకళాపరిపూర్ణచంద్రునివలె తేజోమయుండైన రమేశచంద్రుని అత్యంతశోభాయమానంబును, నవరసభరితంబును అగు జీవితమును నావంటి కించిజ్జ్ఞుఁడు వ్రాయఁబూనుట సాహసమేయగుఁగాక. ఈ కీర్తికాయుని జీవితమును నేను మొదలిడినప్పుడు 30 పుటలలో ముగించదలఁచితిని. కాని ఎంత సంగ్రహముగ వ్రాసినను 66 పుటలకంటె తక్కువలో సమాప్తి చేయలేకపోతిని. ఈ జీవితము యొక్క విషయ బాహుళ్యమును బట్టి చూచిన యిది 300 400 పుటలలో చక్కఁగ వ్రాయవచ్చునని నాకుఁ జెప్పు. శీఘ్రకాలములో అట్టి సమగ్రమగు జీవితము విరచింపఁబడి ఆంధ్రదేశగ్రంథమాలిక యందు ప్రకటింపఁబడుఁగాక. ఇప్పుడు రంగరాయ జీవితము, ఉమేశచంద్రబనర్జి జీవితము, రమేశచంద్రదత్తజీవితము ముద్రించి మూఁటిని జేర్చి 'జీవితచరిత్రావళి' లోని మొదటిభాగముగ పాఠక మహాశయులకు భక్తి వినయములతో సమర్పించుకొనుచున్నాఁడను.

ఈ జీవితములు వ్రాయుటలో భాషవిషయమై నేనంతఁగా పాటుబడలేదు. విషయచర్చయందు ఒక పక్షమును వహించి యుండలేదు. ఈ నాయకుల భావములను, ఉన్నతోద్దేశములను, ఆదర్శములను నిష్పక్షపాత బుద్ధితో సులభశైలిని వ్రాసి చదువరుల యెదుటఁ బెట్టుటయే మొదటినుండియు నా ప్రయత్నము. అందెంతవఱకు సఫలీకృతమనోరథుఁడనైతినో చదు

వరులకే యెరుక. ఆంధ్రభాషా విశారదు లిందలి తప్పులను మన్నించి నాకు తెలుపుదురేని కృతజ్ఞతతో వానిని యీ గ్రంథము ద్వితీయ ముద్రణమునకు ఎక్కు భాగ్యము లభించి నప్పుడు దిద్దుకొనెదను. మఱియు నాయం దాదరముంచి ప్రోత్సాహము కలుగఁ జేతురేని నా యీ 'ఆవలి' ని పూర్తి చేయ ప్రయత్నించెద. పరమేశ్వరుఁడు నాకట్టి యవకాశమును లభింపఁ జేయుఁగాక!

మొదటనుండియు నావిద్యాభివృద్ధికి సహకారుఁడై నాకిట్టి గ్రంథరచనకు శక్తిబీజములనాటిన ఆ మహాభాగునకు అంతరంగమున మున్ముందు ప్రణామము చేసి, ప్రస్తుత గ్రంథరచనకు పురికొల్పినట్టియు, విషయసంగ్రహణమునందు తోడుపడినట్టియు, అచ్చుచిత్తులను దిద్దినట్టియు, వ్రాతప్రతిని శుద్ధము చేసినట్టియు అనేకవిధములుగ నన్ను ప్రోత్సాహపెట్టినట్టియు సహాయము చేసినట్టియు మిత్రవర్యుల కనేక సహస్రవందనములు సమర్పించుకొనుచున్నాఁడను.

ఇది నా పాండిత్య ప్రదర్శనమునకై ప్రచురించి యుండ లేదు. నాకుఁగల భాషాజ్ఞానము కొలఁదియగుటచే నిందు తప్పు లుండు ననుటకు సందేహము లేదు. కావున అట్టివాని నన్నిటిని క్షమించి నాయందు సాదరవాత్సల్యముంచ పండితమండలిని మఱియొకసారి ప్రార్థించుచు నాయీ విన్నపమును విరమించుచున్నాఁడను.

12—5—1918
9 సైదోం వీధి
ట్రిప్లికేన్—మద్రాసు

ఆదిరాజు వీరభద్రరావు

# వి ష య సూ చి క

# పీఠిక

నాకు కల్పవృక్షము గను, గురువుగను, ఆదర్శకుఁడుగను, మిత్రుఁడుగను, ఉండి నన్నాజన్మాంతము కృతజ్ఞతాబద్ధుని గావించి, యాంధ్రమాతసుపుత్రరత్నంబై వెలసిన శ్రీరావిచెట్టు రంగారావుగారియొక్క యకాలమరణము, ఆంధ్రభాషకును, ఆంధ్రలోకమునకును కలిగించిన లోపమటుండ నాకె యెక్కువ నష్టదాయక మయ్యెను ఈమహానియునియందు నాకుఁగల గౌరవభావముకొలఁది దక్షిణహైద్రాబాదునందలి "శ్రీకృష్ణదేవరాయల యాంధ్రభాషానిలయము"లో ది 15 7-1910 తేదిన వీరిమరణమును గూర్చి విషాదముఁ దెలుపుచు జరిగినసభయందు కథానాయకునిజీవితము సంగ్రహముగ వ్రాసి మొట్టమొదటఁ జదివితిని దానినే విపులముగ వ్రాసి ప్రకటించి కథానాయకుని కీర్తిలతను విస్తరింపఁజేసి నాజీవితము సార్థకపఱచుకొనవలయు నని దలఁచుచుండఁగా నన్ను ధన్యుం జేయఁ గాబోలు, విజ్ఞానచంద్రికాగ్రంథమాలసంపాదకు లగు శ్రీయుత కే వి లక్ష్మణరావుపంతులు ఎం ఏ గారు రంగారావుగారి జవితము వ్రాయవలసినదనియు తాముప్రకటించెదమనియునాకు నడిగూడెమునుండి యుత్తరము వ్రాసిప్రోత్సాహయుతునిఁ గావించిరి

ఈగ్రంధరచనకు ప్రప్రథమమునుండి నాకు ప్రోత్సాహకులగు శ్రీలక్ష్మణరావుపంతులుగారికిని, హనుమకొండనిలయము నకు సంబంధించి, నాకు తెలియకుండియున్న యంశములం

దెల్పినాకు తోడ్పడిన నాప్రియమిత్రులగు శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారికిని, నాప్రయత్న మిట్టుల పుస్తకరూపమున వెలువఱచిన విజ్ఞానచంద్రికామండలివారికిని, ఈపుస్తకమును అత్యంతశీఘ్రకాలములో ముద్రణము గావించిన వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారికిని నా కృతజ్ఞతావందనములు సమర్పించుకొనుచున్నాఁడను

**22 1 11**
35 స్వామినాయకన్ వీధి,
చింతాద్రిపేట మద్రాసు

ఇట్లు విన్నవించు
సర్వసజ్జనవిధేయుఁడు
ఆదిరాజు వీరభద్రరావు



శ్రీరస్తు

ఆంధ్రవార్త్త్యైనమ

# శ్రీరంగరాయజీవితము

## ప్రథమతరంగము

---

ఏరాజ్యలక్ష్మి షట్చక్రవర్తుల శాహుబిసకాండములపైఁ దాండవమాడుచుండెనో, ఏరాజ్యము షోడశమహారాజుల దిగంత విశ్రాంతకీర్తిచంద్రిక కాకరమై యొప్పెనో, ఏరాజ్యము సత్కవి పుంగవ సమాశ్రయమై వెలసెనో, ఏరాజ్యము సమస్తభాగ ధేయములకు భవనమై ప్రకాలెనో, ఏరాజ్య మఖండవైభవో పేతమై ఆసియాఖండమునకుఁ బ్రాణమై ప్రబలెనో, అట్టి బ్రిటిషు సామ్రాజ్యమునకుఁ బరమమిత్రమై, హైందవస్వదేశ సంస్థానములలో నగ్రగణ్యమై, భారతమాతృసేవాసమాసాది తమై, ఆంధ్రభాషావధూటీనిలయమై, ధార్మికులకును, శౌర్యధను లకును దావలమై, ఉడపోని సంపదాళికి నిశాంతమై, విరాజిల్లు చుండు నిజాంరాష్ట్రమున భాగ్యనగరమను ప్రసిద్ధనామము గల హైదరాబాదురాజధానీనగరమున సరసుఁడనియు, సాదర హృదయుఁడనియు, మేధావంతుఁడనియు, శాంతధనుఁడనియు, ధార్మికుఁడనియుఁ బేర్కొనఁబడి హైదరాబాదుప్రధానప్రధాని వలన గౌరవము వడసి "సదరు మహాసబీ" యందున్నతోద్యో

గము గాంచి, తన యసాధారణ కౌశల ప్రజ్ఞావిశేషంబులు నధికారులు మెప్పించి, వృత్తిపారంపర్య మనుభవింప దివానుగారి యను గ్రహముగ, ఉపకారవేతనముగా 'మన్సబు' మాసమునకు నూరురూప్యంబుల ఆదాయము దొరతనమువారివలన బొంద నుత్తర్వుఁగొనిన శ్రీ రావిచెట్టు - నరసింహారావుగారి కపరిమితానందము గొల్పుచు, సకలసద్గుణముల కాలవాలమై, సాధ్వీమతల్లి యని కీర్తిఁగనిన శ్రీనరసింహారావుగారి ధర్మపత్ని యగు శ్రీమతి వేంకటమ్మగారి గర్భశుక్తిముక్తాఫలమై, ఆగర్భశ్రీమంతుండగు నేతత్కథానాయకుఁడు శ్రీరంగారాయఁడు, ఈశ్వరసంవత్సర మార్గశిర శుద్ధషష్ఠీ సౌమ్యవాసరమున నుదయము 10½ గంటలకు హైద్రాబాదునగరమునకు సంబంధించిన నల్లగొండకు సమీపముగా నున్న దండంపల్లిలో తాతగారగు అక్కినేపల్లి రంగారావుగారి సదనమున నుదయించెను

తనివిఁదీరఁ దనయుని ముద్దుముచ్చటలు గాంచి ముద మొందు భాగ్యములేక తొలుతఁ దల్లియుఁ, బిదపఁ దండ్రియుఁ బరలోకగతులైరి కేవలము బాల్యమున జననీజనకులఁ గోల్పోయి యేకాకియైన నీబాలుని దుర్దశఁ గని మహాదరమునఁ జేరఁదీసి, వస్తువాహనాదుల నొసంగి, విద్యాభ్యాసము జేయించి, పదమూడవయేట "అనుకూలాం, విమలాం, కులజాం, కుశలాం, సుశీలసంపన్నామ్ పంచలకారాం భార్యాం పురుష పుణ్యోదయాల్లభతే" అను పూర్వోక్తరీతి నాలోచించి, అన్నియు నొప్పిన శ్రీ ఊటుకూరు వేంకటప్పగారి కుమారీరత్న మగు శ్రీమతి లక్ష్మీనరసమాంబను బాణిగ్రహణ మొనర్చి, శ్రీకొమరగిరి అప్పారావుగారు విశ్రుతయశోవంతు లైరి యవ్వనదశ రాగానే యావ

దాస్తి శ్రీరంగరావుగారి స్వాధీనమయ్యెను తండ్రిగారివలన సంపాదింపఁబడిన ఉపకారివేతనము "మన్నబు" స్వీకరించుటవలననే యీకథానాయకునకు 'మన్నెందారు" అను వ్యవహారనామము వచ్చినది

రంగారావు చిన్నప్రాయముననే విద్యాభ్యాసమున కారంభించెనను, తలిదండ్రులు లేని లోపమువలన, మఱికొన్ని యంతరాయములవలన, విద్యావిషయికబిరుదము లొందునంతటి విద్య సాగదయ్యె అయినను చాలినంతవఱకు హిందూస్థాని, మహరాటి, ఇంగ్లీషు మొదలగు పరిభాషల నన్నిటిని నాంధ్రీకరింప సామర్థ్యులని చెప్పుటవలన వీరిక్కి గల భాషాజ్ఞానము తేటఁబడఁగలదు ఆంధ్రభాష యన్ననో, మాతృభాష యగుటఁ గరతలామలకము సంస్కృతమున నించుకఁ బ్రవేశము గలదు విద్యలయందుఁ గల కుమారావ్యాదిపరీక్షలఁ గడతేరి లోకానుభవము గలవారికన్న, మత, సాంఘిక, రాజకీయాది విషయములం గూర్చి సరియగు నభిప్రాయముల నియ్య స్వతంత్రశక్తిమంతుఁ డనుట నిస్సంశయము

కల్పవృక్షమువలెఁ దన నీడఁ జేరు విద్యార్థుల కందఱకుఁ బెక్కుతెఱఁగుల సాయ మొనరించుటయేకాక తన భవనముననే యిడుకొని వారిసౌఖ్యమే తనసౌఖ్య మనియు, వారికి లభించు విద్వత్ప్రభయే లోకమున గల యజ్ఞానతమోపహార మనియుఁ దలంచుచుండిరి వారిసన్నిధి వసించి వృద్ధిఁగాంచిన విద్యార్థి సంఘమున నే నొకఁడను అభాగ్యవశమున నాకు సంభవించిన యనారోగ్యముచే నావిద్య కొనముట్టమికి జనకునిరైవడిఁ బెనుచుచున్న రంగారావుగారు పడినశ్రమ లింతంతని చెప్ప నలవిగాదు

ఈమహామహుని యర్థాంగి విద్యార్థుల నాదఱను దన గన్న కుమారులతీరునఁ బోషించెను

---

## ద్వితీయతరంగము

శ్రీరంగారావు తనకుఁ గల భాషాభిమానమున నాంగ్లేయ, హిందూస్థానీపత్రికల శ్రద్ధగాఁ దిలకించుచు భాగ్యనగరస్థిత భాషావిషయకసమాజముల నన్నిటియందును దాను నొక సభ్యుఁడుగాఁ జేరి కొంతద్రవ్యసాహాయ్యముగూడఁ జేయుచుఁ గొందఱు మహారాష్ట్రస్నేహితసహకారమున 'శ్రీశంకరభగవత్పూజ్యపాదగీర్వాణరత్నమంజూషా' అను చతుర్వేదములు, దశోపనిషత్తులు, అష్టాదశపురాణములు, కావ్యములు, నాటకములు మొదలగు సంస్కృతభూయిష్ఠప్రబంధరాజభాండాగారము నొకటి నెలఁగొల్పె ఇట్టి సమగ్రసంస్కృతిగ్రంథనిలయ మొందును మన హిందూదేశమునం గలుగదని నొక్కి వక్కాణించిన నాతమ్మాత మతిశయోక్తి కానేరదు ఇంతియకాక తద్భాండారమునకై యొసఁగ్చిన రు 2000 ల నిలువసొత్తమునకు వచ్చు వడ్డీచే ప్రతివత్సరంబున నవీనగీర్వాణగ్రంథములఁ దెప్పించి పుస్తకాలయము నలంకరించుచుండె ఆంధ్రేతరభాషానిలయములు కొన్ని హైద్రాబాదున వెలయుట కెంతయు స్వాంతమున నలరి ఆంధ్రగ్రంథనిలయము లేదయ్యె ననియు, ఆంధ్రభాషావధూటి ఇంత యనాదరణదశ నున్నదిగదా యని కలఁగి మాతృభాషామహిళ నాదరించువారు లెక గ్రామ్యభాషాగ్రహపీడితయై నానాఁటికి క్షీణదశకు వచ్చుచుంటఁ దెలుఁగువార్తాపత్రికలమూలముననను, ఆంధ్రప్రబంధవిలోకనముచేతను గ్రహించి

తదభివృద్ధ్యర్థము తనలోఁదా నెన్నివిధములఁ దలఁపోయుచుం డ నీకథానాయకునికోరిక నెఱవేరుకాలము వచ్చియుండెఁ గాఁబోలు స్వర్ణమునకమృతగుణంబును, పద్మమునకు సుగంధమబ్బినట్లు, విద్యాప్రియులును, ధర్మాధర్మవిచక్షణదక్షులును సత్యవాక్యాధురంధరులును, నీతికలాకలాపులును, మునగాల పరిగణా రమాకాంతులును, శ్రీనాయిని వంశకలశోదధిపూర్ణచంద్రులును నగు రాజా వేంకటరంగారావుబహద్దరుగారి భాగ్యనగర దర్శనమున, నీకథానాయకునకు వారితో మైత్రి కుదిరెను తదాది రంగారాయద్వయమునకు స్నేహలత పవారిగ నల్లి వెల్లువిరిసి చతుర్దిశల వ్యాపింపసాగె ఈపురుషపుంగవు లిరువురు బహుభాషాకోవిదులును, హిందూదేశకథాసంగ్రహాది సద్గ్రంథకర్తలును, శ్రీరాజావారి మంత్రిపుంగవులు నగు శ్రీయుత కొమర్రాజు వేంకటలక్ష్మణరావు ఎం ఏ గారి సలహా ననుసరించి భాగ్యనగరమున నొకఆంధ్రభాషానిలయము స్థాపింపవలయు ననియు, దానిక ఆంధ్రభాషను మహోన్నతస్థితికిఁ దెచ్చి, పెద్దనాది సుకవిజనంబుల బహూకరించి, ఆసేతుహిమాచలబృహద్ఖ్యాతలంబున ఆంధ్రభోజుం డని ప్రఖ్యాతివడసిన విజయనగరరాజచూడామణి యగు "శ్రీకృష్ణదేవరాయ' పవిత్రనామమే నామకరణం బొనరింపవలయు ననియుఁ దీర్మానించుకొనిరి "శ్రీకృష్ణదేవరాయాధినామమున గ్రీస్తుశకవర్షసోమగగననిధిసుధాకరనవమాసప్రథమదివసమున" ( 1-9-1901 ) ఆంధ్రభాషానిలయము శ్రీరంగారావుగారి హర్మ్యముననే స్థాపింపఁబడెను పాలవంచ, భద్రాచలము సంస్థానాధిపతులగు మహారాజరాజశ్రీ మహబూబ్ సరఫ్ రాజ్ వంతురాజా పార్థసారధి, అప్పారావు,

సవాయి, అశ్వారావు బహదూరు మన్నె సుల్తాన్ గారు నాఁట సభకగ్రాసనాధిపత్యము వహించి యేతద్గ్రంధభాండాగారము యొక్క ఆవశ్యకత, ఉపయోగములఁ గూర్చి మృదుమధుర వచనరచనోపన్యాసములతో, సభ్యుల కరతాళధ్వనులు ప్రతిధ్వను లీనుచుండ, భాండాగారముఁ దెఱచిరి నాఁటిసభ జయప్రదముగ జరుగుటకు రంగారావుగారి పరిశ్రమమే కారణము తలపెట్టిన కార్యము తుదముట్ట సక్రమముగ నెఱవేర్పవలయు నను పట్టుదలఁగల ఈ ధానాయకుఁడు ఆహారవిహారశయ్యాసుఖంబుల వెచ్చఁబఱచుకొని మఱుదిన ముదయమునుండి వారి వీరికి సభోద్దేశములఁ దెలుపుటకును, సద్గ్రంధములు సేకరించుటకు నారంభించెను పదిమందిచేరి యెట్లో ఒకనిలయము స్థాపించి రను మాటమాత్రమేకాని, దానిని శాశ్వతాభివృద్ధిలోనికిఁ దేవలె ననియు, ఇట్టి ఘనకార్య మెల్లప్పటికి నెఱవేఱకున్న నప్రతిష్ఠ యనియుఁ దలఁచి సాహసించువా రొక్కరైన లేరని చెప్పనేల ? అప్పుడు రంగారావుగారే శ్రీరాజాగారియొక్కయు, తక్కుంగల మిత్రులయొక్కయు, కోరికపై నాకార్యనిర్వాహకమునకు సమకట్టిరి ఈవిషయముఁగూర్చి బ్రహ్మశ్రీ మైలవరపు నరసింహశాస్త్రిలనా రీప్రకారము తమ యభిప్రాయము వెల్లడించిరి

చ 'అతులుఁడు రావిచెట్టుకులశాంబుధిచంద్రుఁడు రంగరావు ధీ
చతురుఁడు సత్యసంధసువిచారుఁడు ధీరుఁడుసాహసాత్ముఁడున్
హితుఁ డతఁ డొక్కఁడే తనకు (శ్రీ మునగాలరాజాగారికి) నెఱతయుఁ గార్యసునాధనంబు స
మ్మతిఁ బరిరంచువాఁ డని సమానసగౌరవవృత్తి వానితోఁ

క హితుఁడ వని నిన్ను బిలిచిన
కతమున నాలించి పూర్ణకరుణాదృష్టిన్
హితమతితో నీబాలనుఁ
జతురతఁ బోషింపు మనుచుఁ జనువునఁ బల్కెన్

చ పలుకఁగఁ గార్యనిర్వహణభారము నంతయు రంగరావు తాఁ
దలపయిఁ బూని కష్టమయినన్ వెనుదీయఁగనేక దీనికై
నెల వొక టేర్పఱింపఁ దన నేర్పున భాగ్యపురాధివాసులం
గలియఁగఁ జేరఁ బిల్చెఁ దగుకాలమున న్నిజనూత్నబుద్ధిచేన్

స్థాపించిన దాది 5 సంవత్సరములపర్యంతము శ్రీరంగారావు గారే కార్యదర్శిత్వము వహించి యుండిరి ఈకొలఁది కాలములోనే ఈయాంధ్రభవనకన్య నెంతటి వృద్ధిలోనికిఁ దేవచ్చునో యంతకన్న నెక్కుడుగఁ జేసిరనుట కెంతయు సందియము లేదు సమస్తాంధ్రగ్రంథములు బాహుళ్యపఱచిరి తాను స్వయముగాఁ జని చందాలు వేయించి, వసూలుకాని ఆదినములలో నిక్కచ్చిగ వసూలుచేసి రు 600-0-0 లు నిలువచేసిరి వీరె కోశాధ్యక్షులుగా నున్నందున సొమ్మున కంతయు మామూలువడ్డి యిచ్చుచుండెడువారు పిమ్మట వడ్డి ఎక్కువవచ్చు నను ఆశతో కార్యనిర్వాహకసభవారి యంగీకారప్రకారము మద్రాసులోని "ఆర్బత్తునాట్" కంపెనీలో దాచియుంచిరి "వడ్డియాస మొదలు చెఱచు" నన్నట్లు "దాచినసొమ్ము దయ్యాలపాలాయె" ననురీతిగ దయాహితు లైనట్టియు, వ్యాజను లైనట్టియు వైదేశీయుల ఆర్బత్తునాట్ కంపెని సొమ్మును గూర్చి లెక్కపత్రము లుంచు శ్రమ గలుగకుండ నీయాంధ్రనిలయబాలకు విశ్రాంతిఁ గలిగిం

చెను ఆహా! తా నొకటిఁ దలఁప దైవ మొక్కటి దలఁచు నను మాట నిపట్టున పాటిక వచ్చినదికదా ?

ప్రతిదినము తనముఖ్యము లగు నిత్యకృత్యములలో నొక టిగ భావించి తనవలన నుద్ధరింపఁబడిన గ్రంథశాలపుస్తకా ధ్యక్షుఁ డగు గుమాస్తాకుఁ దోడ్పడి లెక్కలను, ఉత్తరప్రత్యు త్తరములను వ్రాయుచు, తెలుఁగువార్తాపత్త్రికల నన్నిఁటిని దెప్పించి కొందఱు చందాదారు లాపత్త్రికలఁ జదువకున్నను వారియిండ్లకు బంపి తప్పం చదువవలసినదిగాఁ జెప్పుచు, తెనుఁగు మాటాడుట కేరాక మాటాడిన వెక్కిరించెడివారిని, తెనుఁగు లో మంచిగ్రంథములు లేవని తప్పఁ దలచెడివారిని, ఇది యొక సంఘసంస్కరణసమాజము (Reformers Society) అని భావిం చుచు నియముపట్ల విముఖులై యున్న హైద్రాబాదీయుల నంద ఱిని శ్రీరంగారావుగారు స్వంతతనిజపరిశ్రమమువలన సుముఖులం జేసి పూర్వాచారపరాయణులు, నవీనాచారపరాయణులు అను భేదమున నొండొరులకుఁ గల ఈర్ష్యను పోఁదోలి ఈమాతృ భాషావిషయమైనసమాజమున జేర్చి, ఐకమత్యముతో మెలఁ గింపుచు, ఆంధ్రభాషామృతపానమున వారినందఱిని సుమనసుల నొనర్చి చొక్కించిరి ఇంతియగాక పరమతస్థు లగు మహమ్మదీ యులు, క్రైస్తవులుఁగూడ నిందు సభ్యులుగా నుండిరి ఇట్లు సర్వ మతములవారిని జేరఁదీసి, మతచర్చలకుఁ బోయి తగవు లాడ నీయక, సమాదరణభావమున భాషావిషయమైనసత్కృత్యముల నందఱిని నేకీభవింపఁగా నెవరు గావించిరో, యెవరిభాషాభిమా నముగూర్చి కొనియాడుటకు వేనోళ్లును చాలవో, అట్టి రంగా రావుగారి నెంతకీర్తించినఁ దనివితీరదుకదా ?

కార్యదర్శి, కోశాధిపతి, ఉపదేశకుఁడు, లేకరి, ఒక్కొకి రారి భృత్యుఁడును తానయై సమస్త కార్యము లితరసాహాయ్యము గోరక నిర్వహించుకొనుచుండు నీరంగారావుగారియందుఁ గల విశ్వాసముతో సభ్యులందఱు శ్రద్ధఁ గలిగించుకొని ని జేయుటకు సమయము జిక్కక నిలయాభివృద్ధియెడ నశ్రద్ధఁ జేయుచుండిరి ఈసంగతిఁ జవ్వడిగాఁ గనుపెట్టి 1907 సంవత్సరమున జరిగిన మహాజనసభయందుఁ గార్యనిర్వాహణభారము నందఱుఁ జవిఁ జూడవలయుఁ గాన దనకార్యదర్శిత్వమునకు మఱియొకరి నెన్నుకొనవలసినదనియు, తా నాపదవి నొకటిమాత్రము వదలినను నిలయాభివృద్ధికై యెప్పటియట్లు వంచనలేక శక్తికొలఁది పాటుపడెద ననియు, రంగారావుగారు తమఅభిప్రాయము వెల్లడిపఱచిరి "క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే" అను నీతియే యీ ప్రధానాయకునిరీతి భారము వహించుట కసామర్థ్య మనియో, అశ్రద్ధవలననో, మఱియేకారణముననో మఱల రంగారావుగారినే కార్యదర్శిగా సభ్యులందఱెన్నుకొనిరి కాని రంగారావుగారెంతమాత్ర మాపదవి కొప్పుకొన నిరాకరించిరి అపు డాపదవి మఱియొకరి కీయఁబడి, ఇంతకన్న నమ్మకము గలవా రెవరని యెప్పటియట్ల కోశాధిపతిగను, కార్యనిర్వాహకసంఘసభ్యులలో నొకరుగను రంగరావుగారే ఎన్నుకొనఁబడిరి

నిలయాభివృద్ధికై సదా యోజించుచు, తా మొనర్చిన మార్పులను సభ్యులకు వెల్లడిచేసి అందలి లాభాలాభముల శాంతముతోఁ జర్చించి వారలనుండి యపేక్షితాభిప్రాయములఁ గొనుచు, ఇతరు లొనర్చు మార్పులు తమ కసమ్మత మైన

యెడల నందుఁగల నష్టములు సభికులకు చెప్పఁజెప్పి, మెప్పించి యొప్పించుటయు, ఈకథానాయకుని సదాచరణములు వీరివాదము లెప్పుడును సహేతుకములుగను, యుక్తియుక్తములుగను, నిలయమున కమూల్యలాభకరములుగ నుండుటఁబట్టి వీరి యాలోచనలు అందఱి యంగీకారముం బొందుచు. నిరంకుశపరిపాలన మొనర్చినవి నిలయమునకు సంబంధించిన సదాసదుల కందఱకు నీ నరపుంగవుఁ డంతరాత్మవలె సంతతము నాదరింపఁబడుచుండెను

నిలయమునకు గ్రంథములు, పత్రికలు తెప్పించినంతనే మాతృభాషాభివృద్ధి కానేర దనియు, దీని కనుబంధముగ నొక పాఠశాల నేర్పఱచి నూతనపద్ధతిని చరిత్ర, భూగోళము, గణితము మొదలగునవి తెలుఁగునందే బాలురకు గఱపవలె ననియు, ఒకకోరిక మనమున నాటుకొనెను. కాని నిలయమునందలి యితర సభ్యులు కార్యనిర్వహణభారమునందుఁ దోడ్పడ కలసి వచ్చువారు కామిచే నేమిసేయుటకుం దోపక జంకుచుండెను ఇట్లు కొంతకాలము గడువ నొకనాఁడు కార్యనిర్వాహకసభలో నీవిషయమునుగూర్చి రంగరావుగారు ప్రసంగించిరి సభ్యు లిట్టి సదుద్దేశమునకు మెచ్చి, కొంత చర్చానంతరము కొందఱు విద్యాధికులు పఠనీయగ్రంథనిర్ణీతపత్రిక వ్రాసి యేర్పఱచి, అప్పుడప్పుడు పాఠశాలను సందర్శించి బాలుర పరీక్షించుటకును, మఱికొందఱు బాలుర సమకూర్చుటకును, అవసరమైన పనులు చేయుటకును ఒప్పుకొని నడుములు కట్టిరి ద్రవ్యభారమంతయు రంగారావుగారిపైఁ బడెను మన పూర్వకముగా వీరందులకు సమ్మతించిరి

అంతట నొకదినమున 10 12 మంది పిల్లవాండ్రతో పాఠశాలఁ దెఱవఁబడెను. ఇతరసభికులు చేసిన వాగ్దానముల నప్పుడే మఱచిరికాని రంగరావుగారు మఱునాఁటనుండియే చందాలకొఱకు ఇంటింటికిఁ దిరుగ నారంభించిరి. ఇదియ ఇతర సభ్యులకు, వీరికిఁ గల తారతమ్యము. కార్యనిర్వాహకసభవారి తీర్మానప్రకారము ద్రవ్యవిషయముదప్ప మిగిలినవానిని గూర్చి శ్రద్ధ కలిగించుకొవలసిన ఆవశ్యకము లేకపోయినను, ఎవరు అంటించుకొనక మౌనభావమున నున్నందున సత్కార్యము చెడునని విధిలేక సంబంధము గలుగఁజేసికొనవలసి వచ్చెను. అంతటఁ బఠనీయగ్రంథములఁ దెప్పించిరి. బాలురకు పలకలు, బలపములు మొదలగునవి కొని యిప్పించిరి. బోధనాపద్ధతి నేర్పాటుఁ జేసిరి. ఉపాధ్యాయునకు స్వంతపనిపై గ్రామాంతరము జనఁగా మరియొకరు దొఱుకువఱకు నన్నా పనికి నియమించిరి. ఇట్టుల రంగారావుగారి యజస్రపరిశ్రమవలన నావార శాల 4 5 మాసములు చక్కఁగ జరిగి జరిగి తుద కంతరించెను. ఒక్కమానవుఁ డెంతని పోరాడఁగలఁడు? నిలయమునకై పాటుపడునా? పాఠశాలకొఱకుఁ బ్రయత్నించునా? ధార్మిక విషయములఁ మనసుంచునా? ఈపాఠశాల అంతరించిననాఁడు రంగారావుగారు పడిన పరితాపమునకు పరిమితియే లేదు "ఇట్లు జరుగఁగలదేమో యను సంశయముననే నేను దీనిని స్థాపఁ జంకుచుంటిని" అని నాతో ననియుండిరి

పేరునకుమాత్రము రంగరావుగారు కార్యదర్శిత్వము వదలినను పూర్వసంబంధము వదలియుండలేదు. రంగారావుగారు, పుస్తకాధ్యక్షుఁడు (Librarian) గా నుండుటకు నమ్మకము గలిగి

తెలుఁగుబాసయం దభిమానముంచి పనిసేయ నెవరు చిక్కకు న్నతరి బాషాసేవయం దభిమా నముగల న న్నాయుద్యోగమున నియోగించిరి రంగారావుగారు కార్యదర్శిపని వదలినపిదప, "నీవు పుస్తకాధ్యక్షుఁడవుగా నున్నందున మనసంబంధము తొలఁగలేదు మనసంబ ధ మింతలో పూర్తిగా విడవకూడ దని ప్రస్తావవశంబున నాతో ముచ్చటించిరి

---

## తృతీయతరంగము

వీరు కార్యదర్శిగా నున్నపు డెసభ జరిగినను సర్వసన్నాహముఁ జేయుచు సభికులను వియ్యాలవారిని బిలిచినటులఁ బిలువ వలసి వచ్చుచుండెడిది కాని వా రాపని వదలినతరువాతఁ గూడ తమయింటినౌకరులను వెంట నిడుకొని రెండుమూడు గంటలకు ముందు వెళ్లి అంతయు సిద్ధపఱచి కార్యదర్శిగారిని, సభికులను బిలిపించెడువారు తాంబూలాదులు వీ రొసంగవలసి నదే వార్తాపత్త్రికాదులు ఎప్పటివలెనే వీరియింటికేవచ్చి ఇచ్చ టనుండియే నిలయమునకుఁ గొంపోఁబడుచుండెను ఇప్పటిక నటులనే జరుగుచున్నది

పైన వివరించిన సంస్కృత భాండాగారమునకు ముఖ్యపోష కులుగా నుండినవా రందఱు రానురాను చెయిఁజార విడిచి నందున దానికి సంబాధించిన రు 2000-0 0 ల మూలధనము, నిరుపమానదేశాభిమానుండును,సత్యశీలుఁడునగు రంగారాయుని వాలిటం బడఁగా సంస్కృతగ్రంధనిలయముపేరిట ధనము, ధనాగారమునవైచి గీర్వాణభాండారముతో ఆంధ్ర భాషానిల యముం జేర్చి తల్లిబిడ్డల కాలింగనసౌఖ్యం బబ్బఁజేసె

శ్రీ కృష్ణదేవరాయల యాంధ్రభాషానిలయముపక్షమున బురాతనకవిప్రణీతములైన సత్ప్రబంధములఁ బ్రచురింపవలెనని ప్రయత్నము జేయుచుండిరి ఇట్లు తనకుమారితగా భావించి యల్లారుముద్దుగాఁ బెంచిన ఇయ్యాంధ్రహర్మ్యతనయ అనేక గ్రంథచూడామణిస్థగితవిభూషాభరణాలంకృతయై, ఆంధ్రలోకమున కలంకారమై, సికిందాబాదు, హనుమకొండ ఆదిగాఁగల పట్టణములలోని నిలయములకు మాతృకమై, ఆంధ్రజనస్తోత్రపాత్రమై, ఏకగర్భజనితు లగు మహారాష్ట్రాదిభాషాయోషామణులు బళి, బళీ, అనుచుండ మహోన్నతస్థితికి వచ్చెను ఇట్టి నిలయస్థితికి రంగారావుగారు ఆనందసాగరమగ్నులైరిగాని స్వంతనెల వొకటి లేదయ్యెకదా యనిమాత్రము వారి నొక మూల బాధింపుచుండెను

హైద్రాబాదునందు శ్రీకృష్ణదేవరాయల యాంధ్రభాషానిలయము స్థాపింపఁబడినతరువాతఁ గొంతకాలమునకు రంగారావుగా రొకటి రెండుమారులు హనుమకొండకుఁ జనియుండి, యచ్చటఁ గల కొందఱు భాషాభిమానులతో నొకప్పుడు మాటసామ్యముగాఁ ద్రిలింగదేశమునకు రాజధానిగా నుండిన హనుమకొండయం దాంధ్రభాషానిలయము లేకుండుటఁ గడు విచారకరమని ముచ్చటించుటయేకాక స్థానికు లగువారి సాయముండి వా రించుకి నుత్సాహముతోఁ బనిసేయ సంసిద్ధులుగా నున్నపక్షమున దా మచ్చట నొకమాతృభాషానిలయము నెలకొల్ప సాయపడఁగల మనియుఁ జెప్పిరి అప్పటిలో నీమాట లంతఁగా క్రియాపూర్వకముగా ఫలవంతములు కాకపోయినను తరువాత హైద్రాబాదునందలి నిలయమునకు సభ్యులుగా నుండి

యుద్యోగవశమున హనుమకొండకు రాఁబడిన కొందఱు భాషాభిమానులు నిలయముఁపు గ్రంథములఁ దెప్పించి హనుమకొండయందలి వృద్ధికాము లగు కొందఱు యువకులకుఁ జూప తెలుంగు శా సం జ ౧౮ జూవరి పిమ్మట నొకమారు నిలయస్థాపనకొఱకొక ప్రయత్నము జరిగినది కాని యది సఫలము కాలేదు తరువాత హైద్రాబాదునిలయముఁపు వార్షికవృత్తాంతములను వత్సరోత్సవ సమయములందుఁ జదువఁబడిన పద్యములపాఠములను, ననేకములుగ హనుమకొండ కంపి, రంగారావుగారు హనుమకొండ యందుఁ జల్లపడిన యుత్సాహము సజీవముగ నొనర్చిరి తదనంతరమున కొలఁదికాలమునకే అనఁగా 1904 సంవత్సరము జనవరినెలయొక్కయారంభమున విఖ్యాతదేశహితులును, ఆంధ్ర భాషాభిమానాగ్రగణ్యులు నగు శ్రీరాజానాయిని వేంకటరంగా రావు బహద్దరుగారు హనుమకొండ కేదో కార్యార్థము విచ్చేసి యచ్చటి కొందఱిలో మొలకలెత్తిన భాషాభిమానబీజము నవలోకించినపిమ్మట వెంటనే హైద్రాబాదుకుఁ బోవుట సంభవించెను ఆసందర్భమున శ్రీరంగారావుగారు రాజాగారితో హనుమకొండయందలి భాషానిలయముయొక్క యావశ్యకతను గూర్చి ప్రస్తావించి, వారిపోషకత్వము నానిలయముకొఱకు సేకరించి ఆరంభోత్సవమునకై దిన మేర్పడినతరువాత వీరు శ్రీరాజాగారిని, హైద్రాబాదునందలి పండితవర్యు లగు మైలవరపు నరసింహాశాస్త్రిలవారిని దమవెంటఁ గొని క్రొత్తనిలయమునకై తాము తెప్పించిన గ్రంథములతోఁగూడ 1904 సంవత్సరము జనవరి 25 తేది నాఁటిరాత్రి హనుమకొండకు వెడలిరి మఱునాఁడె నిలయస్థాపనకై సమావేశమైన సభను జయప్రద

ముగ నడుపుటయందు సర్వవిధములం సాహాయ్యపడి తాము నిల యమునకు ద్రవ్యరూపక మగు దానమిచ్చి చందాదారులై తిరిగి యరిగిరి తరువాత వారనేకముద్రణశాలయములకును, గ్రంథ విక్రయశాలలకును, జాబులు వ్రాసి యనేకగ్రంథము లుచిత మును, ఒగము వెలకును పాతికెవెలలకుం దెప్పించి యొసం గిరి క్రొత్తనిలయముయొక్క వ్యవస్థాస్థాపనవిషయమున వారి యాలోచనచు బాందనియంశె మొక్కటియైన లేదని నొక్క చెప్పవచ్చు హనుమకొండయందు బ్రిటిషు పోస్టాపీసు లేనం దున నిలయము స్థాపనమైన నాటగోలె వారే గ్రందముల ముందుగాం దెప్పించి యిచ్చి యనుకూలప్రకారము వానివెలం దెప్పించుకొనుచుండిరి కొంతకాలమువఱకు పోస్టు సౌకర్యముల లోపములవలన పత్రికలు క్రమముగ రానందున వానిని దమ పేర హైదారాబాదునకుం దెప్పించుకొని హనుమకొండకుం బంపు చుండిరి 1909 సంవత్సరమున వారు హనుమకొండకు వచ్చి నిలయము దర్శించి దాని కొకశాశ్వతగృహమును ఉచితముగ నిప్పింప సర్వవిధములం యత్నించిరి కాని యచట నొకదాత అనే కములగు నంతరాయములం గల్పించుటచే నాయుద్దేశము నెఱ వేఱదయ్యె రంగారావుగారు శాశ్వతమగు గృహ మొకటి ఏర్ప ఱుపవలెనని తలంచి నిలయంపుసభ్యులలోం గొందఱు తిలకించి యుండినకొకయింటిని దాము స్వయముగాం జూచి యాస్థలమును గొలిపించి యొకమిత్రునిచే దానిపటము (Plan) దీయించియింటికి వలయు వ్యయమునకుగాను చందా వేయవలెనని చెప్పి కొంత మొత్తమిూకార్యమునకై యిత్తుమని యెవరివలనను నడుగంబడ కన్నే వాగ్దత్తమొసర్చిరి కాని కొన్నికారణములవలన నా

సద్మముగొనఁబడుట సంభవింపనేలేదు ఈవిధముగా రంగారావు గారు హనుమకొండయందలి శ్రీరాజరాజనరేంద్రాంధ్రభాషా నిలయమునకు స్థాపకులలో నొకరుగను, సాహాయ్యకులుగను, ముఖ్యాభిమానులుగ నుండి, తమయౌదార్యముచే దాని నపుష్టు టకుఁ గారకులైరి

శ్రీరాజానాయని వేంకటరంగారావు బహద్దరుగారితో, శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారితో, రంగారావుగా రొనర్చిన మైత్త్రి ఒక శ్రీకృష్ణదేవరాయల యాంధ్రభాషానిలయంబుతో నాగియుండక స్త్రీమూర్తులు ఆంధ్ర భాషావధూటిని ఇతరభాషాంగనలతోఁ దులఁదూగుట కింకనేమి సలుపుదమని యాలోచింపనాగిరి దీనిఫలితమే "విజ్ఞానచంద్రికామండలి" యుద్భవము ఈమండలియొక్క యుద్దేశము గొప్పదైనందున మొట్టమొదటఁ గొంతకాలముపర్యంత ముచితముగ గ్రంథములు వ్రాసి యిచ్చువారును, వానియొక్క అచ్చునకగు ఖర్చులు భరించువారును, వానిని జాదాదారులకుఁ బంపు కార్యభారము నిరపేక్షతోఁ బైవేసికొనువారును, ఏర్పడుట ఆవశ్యకమై యుండెను కావున గ్రంథములు వ్రాసి యిచ్చుటకు శ్రీలక్ష్మణరాయప్రభృతులును, ఖర్చులు భరించుటకు, శ్రీరాజావారును సమ్మతించిరి రంగారావు ద్రవ్యసాహాయ్యము జేయుటయేగాక కార్యభారమును గూడ వహింప సమ్మతించిరి ఏకార్యమును వారూనినను దానిని నిర్వహించుటయందు దక్షశక్తిఁ గలిగియుందురు కార్యనిర్వాహణమునందు వీరి కుండు ఓర్పు, శాంతత, మఱియొకరి యందుండ దరుదని ముమ్మాటికిఁ జెప్పనొప్పును పేరునకు గ్రంథమాల మేనేజరుపదవి వహించినను నిజములో భృత్య

కృత్యముగూడ వీరే చేయుచుండిరి. ఉత్తరప్రత్యుత్తరములు, చిరునామాలు ఎన్ని వ్రాయవలసియున్నను రాత్రింబవళు లనకఁ గూర్చుండి బహుఓపికతో వ్రాయుచుండిరి. పుస్తకములు కట్టలు కట్టుటవల్లను, సదా బండవ్రాత వ్రాయుచుండినందునను, అఱచేతియందు కాయలుకూడఁ గాచియుండినవి. తాను తినను, ఒకరికిఁ బెట్టను బుష్కలముగాఁ గలిగి కష్టపడవలసిన యవసరము లేకుండ నుండి, ఇంటియందు సేవకులున్నను వారిచేఁ బనిం దీసికొనక యింతఁగష్టపడుటలో నీశ్రీమంతుని స్వదేశాభిమానము, భాషాభిమానము సంస్తవనీయముగదా? కార్యనిర్వాహకులు పరిశ్రమ లెఱుంగనిచందాదారులు పెట్టుబాధల నెన్నిఁటినైన సహించుచుండెను. క్రొత్తచందాదారులఁ జేర్చు విషయములో, విద్యాధికులఁ బ్రోత్సాహపఱచి యుపయుక్తగ్రంథముల వ్రాయించుటలో వీరు శక్తివంచన లేక పాటుపడిరి. "విజ్ఞానచంద్రికా గ్రంథమాల"లోఁ బ్రకటింపఁబడిన అబ్రహాము లింకను, హిందూ మహాయుగము, జీవశాస్త్రము, రాణీసంయుక్త, మహమ్మదీయ మహాయుగము అను నీగ్రంథములు తమచేతిమీదుగా వీరు చందాదారుల కొసంగిరి. అప్పుడు చందాదారులసంఖ్య రమారమి 1200. సంపాదకులు మద్రాసునుండి గ్రంథములను ముద్రింపించి కార్యస్థానమగు హైద్రాబాదునకుఁ బంపుచుండిరి. ఇందుచే చందాదారులకు గ్రంథము లందుటఁ జాల యాలస్యమగుచుండెను. కాఁబట్టి కార్యస్థానముగూడ మద్రాసుకు మార్చుట మంచిదని మండలివా రభిప్రాయపడిరి. కాని తన రెండవకుమారితగా భావించుకొనుచున్న నీగ్రంథమాలను విడనాడుట రంగారావుగారికి గష్టతరముగా నుండెను. అయినను ఈ

మహామహులంగు ఈమార్పువలన గ్రంథమాల యెక్కువ వృద్ధి లోనికి వచ్చునని యెల్లో యియ్యకొనెను చతుర్థకుసుమ మగు రాశీసంయుక్త గ్రంథానంతరము అనగా 1909 సంవత్సరము డిసెంబరునెలలో విజ్ఞానచంద్రికాకార్యస్థానము హైద్రాబాదు నుండి మద్రాసునకు మార్పఁబడెను ఆసందర్భమున రంగా రావుకూడ సకళత్రముగా మద్రాసునకు విచ్చేసి మహమ్మదీయ మహాయుగమును జందాదారుల కొసఁగి మండలిపనుల నెఱ వేర్చుచు నెలకు రు 100 ల చొప్పున దమస్వంతసెలవుపై నాలుమాసములుండి తుదకుఁ గార్యనిర్వాహణభారము, సమా నోత్సాహముగల శ్రీయుత డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి ఏ ఎం బి సి ఎమ్ గారికి నొప్పగించి విధిలేక స్వగ్రామమున కరిగిరి ఆహా! ఏమి వీరి స్వార్థత్యాగము!

---

## తురీయతరంగము

విజ్ఞానచంద్రికాకార్యస్థానము మద్రాసునకు మార్పఁబడి నను హైద్రాబాదునందు దాని కొకశాఖ నేర్పఱిచి, తాము పనిజేయఁ బూనుకొనిరి నిజాంరాష్ట్రమునందలి చందాదారు లకు మద్రాసునుండి పుస్తకములు వి పి గాఁ బంపుటకు పోష్టు సౌకర్యములు లేనందున రంగారావుగారు తాము గ్రంథములఁ దెప్పించుకొని, యించుమించుగా 200 మంది చందాదారుల కందఁజేయుచుండిరి ప్రధానకార్యస్థానమువారికి కొంచెము శ్రమ తగ్గించుటకై పునర్ముద్రణములు గావలసిన గ్రంథములను తాము హైద్రాబాదులో నచ్చు వేయించుచుండవలయు నను నభిప్రాయ మిప్పుడిప్పుడే యంకురించి యుండెను ఘనతవహించిన నైజాం

గారి ప్రధానమంత్రి యగు శ్రీమహారాజా కిషన్ ప్రసాద్ బహద్దర్, జ సి ఐ ఇ గారి రాజసౌధమున గోలకొండనవాబుల మంత్రిశిఖామణులై కీర్తిశేషులైన అక్కన్న మాదన్న గార్ల రూపపటము లున్నవని తెలిసి వాని ప్రతిబింబముల విజ్ఞాన చంద్రికకొఱకు సంపాదింపఁ గడఁగుచుండిరి అచ్చట శస్త్ర శాస్త్రవిశారదులును విదుషీమణి యగు శ్రీమతి సరోజని నాయఁడుగారికి మనోనాసుఁడగు ముత్యాలగోవిందరాజులు నాయఁడుగారివద్దఁ జని మండలి గ్రంథములన్నియుఁ జూపి వారిని చందాదారులుగాఁ జేర్చి శారీరశాస్త్రమును వ్రాయవలసినదిగా బలవంతపఱచి రంట ఆమఱుదినమే రంగారావుగారికి రుగ్ణతారంభమగుటఁ దలపెట్టినకార్యములు పరిసమాప్తి నొందవయ్యె

పురుషులతోపాటు స్త్రీలుకూడ విద్యావతు లయినయెడల దేశమున కెంతో మేలుకలుగు ననియు, ముఖ్యముగా హైదరాబాదునందలి స్త్రీలు విద్యావిహీన లయియుంటఁ జూచి వారి నేవిధముగనయినను వృద్ధిలోనికిఁ దేవలె ననియు పరీక్షలలో కృతార్థు లయినవారికిఁ గొన్ని బహుమానము లిచ్చునటుల రంగారావుగారు తలంచి యేర్పాటుచేసిరి కాని యివియు నెఱవేరియుండలేదు తదుపరి కుట్టుపనులు మొదలగునవి నేర్పించి, విద్యాభివృద్ధి గావింపవలె నను తలంపుతో 'ఆంధ్రమహిళా సంఘము' అనుపేరుతో నొకసమాజ మేర్పఱిచి, దానికిఁ దమ సతీతిలక మగు శ్రీమతి లక్ష్మీనరసమాంబగారిని కార్యదర్శినిగా నియమించిరి.

గీ॥ మణని వలయంబు వలయాన మణి వెలుంగు
రెంట నొప్పారు హస్తంబురీతిఁ దనరి
పత్నిచే భర్త భర్తచే పత్ని యొసఁగు
నిట్టిమిథునంబుచే వంశ మేఁపుఁ జూపు

అను నార్యోక్తి ననుసరించి వర్తించు సాధ్వీగాన మనో నాయకుని యభిప్రాయముల నెఱవేర్చుటయం దప్రమత్తురాలు గాక సదా పాటుపడుచు పతియాజ్ఞానువర్తిస్సియై మెలంగుచు సహధర్మచారిణి యను నామము సార్థకపఱిచిన యావనితా రత్నము, తనపై మోపఁబడిన కార్యభారమును సంతోషముతో స్వీకరించెను ప్రతిశుక్రవారము వీరియింటనే సభలు జరిగి, నాఁడు పలువురు యువిదలచే స్త్రీవిద్య, శిశుపోషణము, గృహ నిర్వాహకము, పాతివ్రత్యము, ఐకమత్యము మున్నగు విషయ ములం గూర్చి యుపన్యాసములు జరుగుచుండెను రంగారావు గారీసంఘమున కొకపుస్తకాలయ మేర్పఱిచి, గ్రంథములన్ని యుఁ దామే యుచితముగా నియఁ దలంచియుండిరి ఇంతలో కొన్ని కారణములవలన రంగారావు దానితో సంబంధము వదల వలసి వచ్చెను స్త్రీవిద్యయం దభిమానము గలవారు మఱి కొంద ఱున్నను, వీరివలె పనిచేయువా రరుదు కనుక ఆసభ యంతటితో నంతరించెను లేనిచో నిప్పటి కాసభ యెన్నియో గ్రంథములకు నిలయమై, ఎంతమందియో విద్యావతులగు నారీ మణులకుఁ బుట్టుఁగొమ్మయై యున్నతదిశకు వచ్చియుండు ననుట నిస్సందేహము

రంగారావుగారు పూర్వాచారపరాయణులనియు, ఆయా చారముల ఛాందసముగ నవలంబింపక వానియుపయోగములను

బాగుగ తెలిసికొనిరనియు మనము చెప్పవచ్చును ఆరోగ్య శాస్త్రము ననుసరించి ప్రత్యహ ముదయమున స్నానసంధ్యానుష్ఠానాదివిధులనెఱవేర్చి భగవన్నామసంకీర్తనము జేయుచుండిరి దేవతారాధన వైదికులు సరిగాఁ జేయనందున తానే తన్మంత్రవిధానములనేర్చి జరుపుచుండిరికాని యితరబ్రాహ్మణ నామమాత్రులబలె సంఘమునం దైక్యభావము జెడఁగొట్టి యుండలేదు వీరు పూర్వాచారపరాయణులని చెప్పుటవలన సంఘసంస్కరణపరాయణులు కారని చదువరులు తప్పఁ దలంప కుందురుగాక శిష్టాచారమున దేశాభివృద్ధి కవశ్యము లగు వానినే స్వీకరించి, తద్వృద్ధికాటంకము లగువానిని విసర్జించి, సర్వస్వాతంత్ర్యకమును స్థాపింపవలయు నని వారియుద్దేశము ప్రస్తుతమున్న వర్ణములవలననే దేశమున కెంతియో అనర్థము వాటిల్లుచుండ భరతఖండమునం దెచ్చటనులేక మన యాంధ్ర దేశముననే నూతనముగా నుద్భవిల్లిన నియోగివైదికకక్షులం గూర్చియు వేదోక్తము గావలయుననియు, అక్కరలేదనియు, రెండుభాగములుగాఁ జీలిపోయిన వైశ్యులఁగూర్చియు, ఎంతియో విచారపడి వారిమార్ఖ్యమునకుఁ గంటఁ దడిపెట్టుచుండిరి

---

## పంచమతరంగము

నిరు గొప్పస్వదేశాభిమానులు వీరియభిమాన మద్వితీయము కలకత్తా కాంగ్రెసు సమావేశానంతరము బయలు వెడలిన స్వదేశోద్యమమును వీరంతకుముందే యవలంబించిరి దేశీయవస్తువులను వాడుటకును, దేశీయవస్త్రములను ధరించుటకును 10 సంవత్సరముల క్రిందటనే దీక్షవహించియుండిరి

కాని కలకత్తాసభానంతరము ద్విగుణీకృతోత్సాహులయి పని చేసిరి. తాను స్వదేశీయమును వృద్ధిపొందించు తలంపుతో నితరులను బ్రోత్సాహపఱిచి, హైద్రాబాదునందును కాళీఘట్ట మునందును గల 'షిరాల్‌కరు' 'స్వదేశవస్తుభాండాగారము'ల లో (The Indian Stores) కొన్ని భాగములు పుచ్చుకొని యుండిరి. జాతీయకలాశాలస్థాపనాది స్వదేశోద్యమజని తానేకమహత్కార్యములకుఁ దోడ్పడి వాని నభివృద్ధిఁ జెప్పుట యం దనేకవిధముల వీరు సాహసించిరి.

1908 సంవత్సరమున హైద్రాబాదునందు సంభవించిన జలప్రళయముచే నష్టపడినవారిక యీరంగారావుగారు వలయు నంత సాయముచేసిరి. ఇండ్లు వాకిండ్లు కూలి నానావస్థలకు లోనయినవారిక వీరియిల్లు శరణ్యమై యుండెను. ఔదార్యవం తులగు నైజాందొరతనమువారిచే స్థాపింపఁబడిన "శ్రమనివా రణసంఘము" ((Relief Committe) నందు విరుకూడా చేరి యింటింటికిని దిరిగి పనిచేసిరి. ఇట్లు దేశముకొఱకును బాషకొఱ కును తనసర్వస్వము ధారబోసి స్వార్థపరత్వము, స్వకార్యధు రంధరత్వము స్వకుక్షింభరత్వమునకై చరించునరులకుఁ దలవం పులు ఘటించి, ఆంధ్రభాషాయోషామణికి వన్నె దేర్చి, మనుష్య శరీరము ధరించిన ప్రాణికోట్లకెల్ల లోకోపకారబుద్ధి ప్రాముఖ్య మనియు, దయాంతకరణ మందునకు సాధనమనియు, సత్యము సర్వశ్రేయమనియు, శాంతము సర్వదా సుగుణనికరవిశ్రాంత మనియు, భూతదయాపశ్చాత్తాపములు ముఖ్యపరికరములనియుఁ దనజన్మమంతయుఁ బ్రపంచమున నెఱవేర్పఁబూనిన సత్కార్య ములు చాలినంతమట్టుకు లోకహితముగా నొనర్చి కువలయ

మున కుదాహరణరూపకమయిన యీకథానాయకుఁ డింకయు చేయఁబూనిన కార్యములకు విఘాతంబుగా లోకహితకారులగు శ్రీశంకరులకుఁ బ్రాప్తించినట్లు ముప్పదిరెండేండ్లకే అకాలమృత్యువువాతఁ బడవలసివచ్చెను ఈశాంతమూర్తికి, ఈసత్యవాదికి, ఈనిగర్వచూడామణికి, ఈపరోపకారపారీణునికి, ఎన్నఁడును రోగ మెట్టిదియో యెఱుఁగని యీదృఢకాయునికి అకస్మాత్తుగా నగ మ్యమగువ్యాధి కనుపడి దానిచే వారమురోజులు బాధపడి, ఎంత మంది ధన్వంతరులు చికిత్స చేసినను ఫలింపక, శ్రీకృష్ణదేవరాయల యాంధ్రభాషానిలయపు దురదృష్టమువలనను, విజ్ఞానచంద్రికా గ్రంథమాల దౌర్భాగ్యవశంబునను లక్ష్మీనరసమాంబను దుర్భర శోకసాగరంబున ముంచి, విద్యార్థుల దుఃఖాగ్నిచే దహించి, బాంధుమిత్రజనంబుల వియోగముపాలుచేసి,ఆంధ్రమాతకఁ దుపున జిచ్చిడి, యీమహానుభావుఁడు, యీస్త్రీవిద్యాభిమాని,యీజగ ద్విఖ్యాతకీర్తిమంతుఁడు, యీదీనజనరక్షాధురంధరుఁడు సాధా రణసంవత్సర జ్యేష్ఠబహుళద్వాదశీ ఆదివారము (3-7-1910) సాయంతనమున నాలుగుగంటలవేళ పరమేశ్వరుని సన్నిధాన మున కేగెను ఈఘోరవార్త మహదుత్పాతకరమై కర్ణ కఠోరమై సంతాపకరమై గర్భనిర్భేదనకరమై సమస్తజన నాశంక రమై యప్పుడె యాంధ్రప్రపంచమునం దంతట వ్యాపించి హా! హా! రావములు సెలంగ జనులు వీరియాకస్మికమరణమున కెంతయు వంతఁగుంది, సభలుచెసి, పత్త్రికలకువ్రాసి, పద్యములు రచించి, తమతమ చింతాభరములఁ గొందఱు వెల్లడించిరి "ప్రపంచమున జన్మమెత్తినందులకు సాహసించి, చేతనైనంత సత్కార్యములఁ జేసి, అమేయమహిమోపేతుఁడై, ఆచంద్రార్క సద్యశస్సాంద్రుఁ

గ్రై, తనకులమున జనినవారికిని, ఉన్నవారికిని, బుట్టనున్నవారికిని శిఖరోపముఁగైన నీపుణ్యమూర్తి, న్యాయానువర్తి, ధీరసద్గుణ విస్ఫూర్తి, దివ్యమూర్తియొక్క పరిశుద్ధాత్మకుశాంతి గలుగుఁగాక” అనియు, ‘ఓపరమాత్మా, నిన్ను నిశ్చలభక్తమై నహర్నిశముల నెవరు తలంచుచుండిరో, నిన్నే దిక్కుగా నమ్మి స్వసుఖమ్ము నమ్మి లోకమున కెవరు మేలుగూర్చిరో, జనులనందఱిని సహోదరభావమున నెవ రాదరించుచుండిరో,సత్కార్యములఁ జేయ నెవరు సదా ప్రయత్నించుచుండిరో, అట్టి నీపరమభక్తుఁడు, లోకబాంధవుఁడు, సచ్చరిత్రుఁడు, నిన్ను జేరె నీసన్నిధాన మున మన్ననలఁ గొనుచుండుఁగాక మమ్మెన్నఁటిక మఱవకుండుఁగాక” అనియు, “ఓపుణ్యపురుషా, రంగరాయా, నీవు సచ్చిదానందమూర్తిపాలికిజనితివి నీపుత్రికులవలెఁ బెనుచుచుండిన విద్యార్థుల మఱచిపొమ్ము నీకత్యంతప్రియమిత్రుఁగు వారినెల్ల మఱచిపొమ్ము నివాచరించు కార్యములకెల్ల దోడునీడవైు, నీయాజ్ఞకు మాఱాడక పుట్టిమెట్టిన యిండ్లకు సత్కీర్తి గడించిన నీ యర్ధాంగలక్ష్మిని మఱచిపొమ్ము ఈలోకము బాగుపఱుపఁ బరమేశ్వరుని మఱువకఁ బ్రార్థింపుము ఆముష్మికసుఖములను, శ్రేయమును గాంచుచుండుము” అనియు, జనులందఱు పలుపలురీతులఁ బలవించుచున్నారు లోకమున వీరిజన్మమె సార్థకమైనది వీరే మహాపురుషులు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతి



# శ్రీరంగారావుగారి మరణమునుగూర్చి రచింపఁబడిన పద్యములు



సీ. దేశభాషను తన • దేశంబులోపల
వృద్ధి చేయఁగ నేర్చు • బుద్ధిశాలి
శాంత్యాదిగుణముల • సన్నుతి గాంచిన
నిర్మలకర్మాభి • ధర్మశాలి
విద్యార్థికోటికి • వివిధవిధంబుల
సాహాయ్య మొనరించు • శక్తిశాలి
మాటాడి తప్పని • మానవేశులివారి
శ్చంద్రునిఁ బోలిన • సత్యశాలి

గీ. పిన్న పెద్దల నొకతీరు • చెన్నరావి
చెట్టు వంశాంబురాశికి • శీతకరుఁడు
రంగరాయుండు కడు చిన్న • ప్రాయముననె
భువిని విడనాడి కటకటా! • దివముఁ జేరె!

సీ. పతిభేదమును లేఁ • మతిబేదమును లేక
యైకమత్యంబుచే • నలరువాఁడు
కుటిలత్వమున నేర • కోపగించినఁ గాని
కోపగించక మేలు • కోరువాఁడు
తూలనాడిన నేని • దోషంబు లెంచక
మానుగా శాంతంబు • పూనువాఁడు
పరకష్టము లడంప • భావించి ముందుగ
కడుగిడఁ గడువడిఁ • గడఁగువాఁడు

గీ. సతతసంతోషపూరిత♦స్వాంతుఁ డగుచు
వర్తనంబున జనమతి♦కీర్తిఁ గాంచు
వానికా! పసివానికా! ♦ మాన కింతల
పాపి! యీమృత్యుదేవత ♦ వాపరించె!

సీ. హిందుదేశంబున ♦ హీనమై జీర్ణమై,
వాసి బాసిన తెల్గు♦బాసపైని
జాలిఁ గొల్పఁగఁ జాల ♦ మేలు చేయఁగ నెంచి
అల వ్యాప్తము చేయ ♦ మదినిఁ దలఁచి
మునగాల, గద్వాల, ♦ వనపర్తి, భద్రాచ
లాధినాథులపాలి ♦ కరిగి యరిగి
వారికి భాషపై ♦ వాత్సల్య మొదవింపఁ,
బ్రోత్సాహమును గూర్ప ♦ నుత్సహించి
గీ. కష్టపడుచును మదిలోనఁ ♦ గలఁతఁబడక
తనరఁ దనశక్తినంతయు ♦ ధారపోసి
తుదకుఁ గార్యార్థసిద్ధుఁడై ♦ తోటఁ గూడె
యందు నాంధ్రధాళయంబును ♦ బొందుపఱచె

సీ. ప్రతిదినంబును దాను ♦ హితులయిండ్లకు నేగి
భాషాభిమానంబు ♦ పాదుకొల్పి
పెద్దవారలు వీరు ♦ గొప్పవారలు వీర
లనుమాట నెంచక ♦ కనికరంబు
మదిలోన నెకొన ♦ మల్లాడి నిలయావ
నార్థంబు తెనబుద్ధి ♦ సార్థపఱచి
యనయంబు గందఱు ♦ చనుదెంచి పొత్తముల్
చదువఁగా నేర్పాట్లు ♦ కుదురుపఱచి
గీ. గ్రంథబాహుళ్య మొనరించి ♦ కలిమి నింప
జేతి నయినంతఁగాఁ దన♦చేతిసొమ్ము

వెచ్చపెట్టుచు గ్రంథము ♦ ల్వెచ్చపెఱగఁ
జేసె నీరంగిరాయుఁడు ♦ వాసి మీఱ

సె. ధనవంతులై యుండి ♦ ధర్మంబు లేకుండి
యుపకారమున కింత ♦ యొప్పకుండి
వేలు లక్షలు కోట్లు ♦ చాలఁగా నార్జించి
శ్రీమంతు లనుపేరఁ ♦ జెలఁగ ధరణి
శ్రీమంతులమంచి నా♦శీమాంతులై పోదె
తనువు పోయినవెన్క ♦ ఘనత లేక
తనువు పోయినఁగాని ♦ తనకీర్తి స్థిరముగ
ధరణపై నుంచెడు♦ధనమె ధనము

గీ. యనుచు నీరంగరాయుండ ♦ వనమునందు
నెంచి లోకోపకారంబు ♦ మించి చేయ
గలిగినంతనె వే యాయ♦కాలమృత్యు
వేల ప్రాప్తించె నయ్యయో ♦ జాలి మాలి!

క. హా! హా! యోసుగుణాత్ముని
మహాంతరవార్త వినిన♦దేశజు లెల్లన్
దాహంబు చెందకుందురె!
శ్రీవారిచిత్తంబు నేమి ♦ చెప్పఁగ వచ్చున్

సీ. విజ్ఞానచంద్రిక ♦ ప్రజ్ఞావిశేషంబు
దీపింపఁగాఁ దాను ♦ దేజరిల్లి
తనదేశభాషను ♦ తనవలె నెవ్వఁడైన
నభివృద్ధిఁ జేయఁగ ♦ నలరువాఁడు
కలుగునో కలుగఁడో ♦ కనువాఁడ ననుచును
సిద్ధార్థుఁడై వని ♦ జేరినాఁడొ
రూపింపఁ దా బుద్ధ♦రూపంబు ధరియించి
యోగసమాధియం ♦ దుండినాఁడొ

గీ. యనుచు శంకింప నేటికి ♦ మనమునందు
అజుఁడు వ్రాసినయల్పాయు ♦ వగుటచెసి
సారసాప్తుండు తనదిన♦ పర్య మాని
పశ్చిమాంబుధి గ్రుంకిన♦పగిదిఁ గ్రుంకె

సీ. ముప్పదిరెండేండ్లు ♦ మున్నూరయేడులా !
ముసలివాఁడై తాను ♦ విసుగుఁ జెంద
ధనము లేకుండెనా ! ♦ తనివార సుఖపడ
బలము లేకుండెనా ! ♦ బ్రతికియుండ
లోక బాంధవ్యంబు ♦ లోపమై యుండెనా !
సిగ్గాయె నంచు రో♦చించుటకును
ఎవరైనఁ దనకేమి ♦ యొగ్గు చేసెద నంత
పరుషంబు లాడెనా ! ♦ విరసమతిని

గీ. వయసువాఁ డయ్యు బహుధన♦వంతుఁ డయ్యు
బలము గలవాఁడు నయి లోక♦బంధుఁ డయ్యు
పరుషవాక్యంబు లాడని♦పురుషుఁ డయ్యు
మనల విడనాడఁ దా నెట్లు ♦ మనసుపడెను !

సీ. శాలివాహానశక♦సంవత్సరంబులు
పదియేడునూటతొం♦బదియు తొమ్మి
దీశ్వరాబ్దమునందు ♦ నెలమి మార్గశిరంబు
శుభశుద్ధపంచమీ ♦ సోమవార
మునను జన్మించెను ♦ ముదమార నరసింహ
రాయున కెలమి నీ♦రంగరావు
ప్రాపంచకజ్ఞాన ♦ మేపార లోకోప
కారంబుకొఱకుఁ దా ♦ కష్టపడుము

గీ. వరుస ముప్పదిరెండేండ్ల♦వఱకు బ్రతికి
జనుల కానందసంధాన♦ఘనత నొంది

పగిది సాధారణజ్యేష్ఠ ♦ బహుళ రుద్ర
దినము దినకరుదినమున ♦ దివముఁ జేరె !

మైలవరపు నరసింహశాస్త్రి

---

క. అసదృశగుణగణశోభిత !
వసుధామరవంశదీప ! ♦ భగవత్పదసా
రసభసలాయితహృదయ ! స
రసకేయా ! రావిచెట్టు ♦ రంగారాయా

సీ. ఆంధ్రభాషాదేవి ♦ నశ్రాంతభక్తితో
సేవించుచుండెడి ♦ పావనాత్మ !
భారతిమాతృదై ♦ వతమును నిత్యంబుఁ
దగురీతిఁ బూజించు ♦ సుగుణభరిత !
భారతీయులనెల్ల ♦ భ్రాతృవర్యులగాఁగఁ
దలపోయుచుండెడు ♦ ధన్యచరిత !
దీనమర్త్యుల దయా ♦ ధీనమానసమున
సాదరంబునఁ జూచు ♦ సదయహృదయ
గీ. మాపయిని గల్గుప్రేమంబు ♦ వట్టుపరచి
యవనిలో గల్గుసర్వసౌ ♦ ఖ్యములు ద్రోసి
స్వర్గసౌఖ్యంబు లనుభవిం ♦ పగ దలంచి
పోయితే ! మమ్ము నెడబాసి ♦ భువిని విడిచి

సీ. ఆంధ్రభాషానిల ♦ యము నీవు కనరామి
ఖిన్నత నెంతేని ♦ జిన్నవోయె
విజ్ఞానచంద్రిక ♦ వెస నిన్ను గనుగోమి
ననయంబు వెలవెల ♦ లాడదొడగె

భారతమాత నీ♦పలుకులు వినరాక
సెగలున గన్నీరు ♦ నించుచుండె
ఆంధ్రదేశంబు నీ♦యర్చనల్ గానమేమి
దీనత నొంది చిం♦తించుచుండె

గీ దేశజులు నీదుసానుభూ♦తిని దొఱంగి
కుందుచున్నారు తిరుగని♦కొండలమున
బంధుమిత్రులు దుఃఖాగ్ని♦పాలబడిరి
నీవియోగంబు సహియించు♦ట్రోవలేక

ఆ అకట! యిట్లు వీరి ♦ నందరి నెడవాసి
గుండెరాయిజేసి ♦ కూర్మి గోసి
స్వర్గలోకమందు ♦ సౌఖ్యంబు లందంగ
నుల్ల మెట్లు నీకు ♦ నొప్పెనయ్య

ఆ నీవు లేకయున్న ♦ నీగ్రంథనిలయంబు
చంద్రికయును వృద్ధి♦ జెందకుండ
నైన నీవు లేని♦యాలోటు మాకెప్పు
గల్గుచుండు సుమి జ♦గత్కుటుంబి

సీ విజ్ఞానచంద్రిక ♦ వృద్ధిఁ బొందుచు నుండె
నిఁక నేమి మనకని ♦ యెంచినావొ?
ఆంధ్రభాషానిల♦యము స్థిరత్వము జెందె
నిఁక నేమి మనకని ♦ యెంచినావొ?
దేశసేవను జేసి♦తిని సుకృతుఁడ నైతి
నిఁక నేమి మనకని ♦ యెంచినావొ?
తగురీతి బీదసా♦దల నాదరించితి
నిఁక నేమి మనకని ♦ యెంచినావొ?

గీ యౌవనమునందె సురలోక ♦ మరిగినావు
నీదువిధ మెల్ల దీరెనె ♦ నిక్కముగను

సలుపవలసినపని లింక ♦ చాల గలవు
రమ్మి వేవేగఁ బనిసేయ ♦ రంగరాయ

చ అమరులకొజ్జయై తగు బృ♦హస్పతిసన్నిధి నెల్లవిద్యలన్
నమరగ నొప్ప నేర్చి పర♦జన్మమునందున నీదుసోదరో
త్తములకు నేర్పి దేశము న♦దంచితలీలను వృద్ధిజేయ స్వ
ర్గమునకు బోయితే రివశ♦బూ నెరవేరుత నీదుకోంకర్

ఆ నీదుదేవభక్తి ♦ నీదేశభక్తియు
నీదుసుగుణశక్తి ♦ నీసుశక్తి
మెచ్చి కరుణతోడ ♦ నిచ్చుత నీయాత్మ
కెపుడు జెడనిముక్తి ♦ నీశ్వరుండు

యమ్ వి యస్

---

చ ఫలములచేత గొన్నిటిని, ♦ బల్లవసంతతిచేత గొన్నిటిన్
సలలితసౌఖ్యదాయి యగు♦చాయను గొన్నిటి, వేవిధాల నీ
యిలను ననేకప్రాణుల క♦హీనసుఖం బిడు వృక్షరాజమున్
బలువడి బీకి వైచితె? తు♦పాన! వినాశము చేసి వైచితే?

చ నయగుణభూషణుండు, పర♦నారులకెల్లను సోదరుండు, ని
త్యయశుఁ డనన్యలభ్యసము♦దారచరిత్రుఁడు, సాహసాత్ముఁడున్,
దయయును సౌహృదంబునకు♦దాత్తనిదానుఁడు, సర్వసజ్జన
ప్రియుఁ డగువాని నిట్లు విప♦రీతపుకలరా! మ్రింగి వైచితే?

మ స్వకుటుంబమ్మును రక్షసేయుటకె యీ♦సర్వం బటంచు న్దలం
చి, [illegible]డున్ స్వార్థపరాయణత్వమున ని♦శ్చింతాత్మతో నుండు, లు
బ్ధకులోత్తంసులు కానరా రధమురె నీ♦పాపంపుకన్దోయి కి,
ట్లకటా! మృత్యువ! ఏమనంగ దగు నీ♦యంధత్వమాహాత్మ్యమున్?

మ. అపలస్వాంతత నెవ్వఁ డాంధ్రసుకలా♦వ్యాప్త్యర్థమై సత్సమా
జముల న్సర్వజనోపయోగమునకై ♦ స్థాపించె, నెవ్వానికిన్
సముఁ డౌ నాతఁడు గానరాఁ డకట దు♦స్సాధ్యంబొ యవ్వారినా
సము నే డీఁగతి మాపిరొంటవె? నిజా♦మ్రాష్ట్రాంధ్రభూభాగమా

ఉ. హా, మిత్రక, రంగరాయ! ఘన♦పుణ్యులలో మునందు నుండ, నీ
సౌ మ్మగుగాక యెన్నఁడును ♦ శోకము లేనిప వాత్సుఖంబు ముం
దమ్మలు నీగుణా వళిని ♦ నాత్మసుతాళి కెఱుంగఁజేసి, నె
మమ్ముగ వారి నెప్పుడు సు♦మార్గమున న్నడపింత్రు గావుతన్

మాడపాటి - హనుమంతరావు

---

సీ. ఆగయ నేబుధుం ♦ డాంధ్రభాషానిల
యమ్ము బ్రతిష్ఠించె ♦ నిమ్ముగాను
నేసత్యసంధుండు ♦ నెలమిని విజ్ఞాన
చంద్రికామండలి ♦ పొందుపరిచె
నేగుణనిధి చాల ♦ నేప్రౌఢ విద్యార్థు
లకు భోజనం బిడు ♦ ప్రాకటముగ
నేకీర్తివంతుండు ♦ నేపుగా నాంధ్రిల
పై బ్రీతి నిల్పుచు ♦ ప్రబలుచుండు

గీ. నట్టిభూసురకులదీపుఁ ♦ డైన రావి
చెట్టు వంశాబ్ధిచంద్రుఁ డౌ ♦ సిరులపేటి
రంగరాయుండు దివి కేగె ♦ రామనామ
ముచ్చరించుచు మనమున ♦ మెచ్చుచుండ

సీ. అతిథిసత్కారంబు ♦ నాదరంబుగఁ జేయ
కెన్నఁడు భుజియింప ♦ నెరుగఁడాయె
తెలుఁగువారికిఁ దెల్వి ♦ గలుగునంతటిదాక
పట్టు విడువ నంచు ♦ గట్టిబల్కు

దేశమాతృఋణంబు ♦ దీర్చుపర్యంతము
నిద్రపోవను జన్మ ♦ నిండ బల్కి
ఘనులచారిత్రముల్ ♦ స్మరించి
నార్ద్రీకరింపంతు ♦ నంచుఁ బల్కి

గీ. నట్టిపుణ్యాత్ముఁ డెందరి ♦ యాప్తుఁ డవని
వాసి నేమని దెల్పుదు ♦ గోసి మిగుల
నివాసుఖంబుల నొల్లక ♦ నించుకైన
దేవసఖ్యము గోరుచు ♦ భావమందు

చ. పరగతి గోరఁ డెన్నఁడును ♦ బల్కఁ డసత్యము నెన్నఁడేనియున్
పరపతిలేనివారల కు♦పాయము జూపుచు నందు నెంతొ నా
దరమున రంగరాయఁ డిల ♦ దైన్యులజేయుచు నాంధ్రులందరిన్
తిరము గ గాసి స్వర్గమును ♦ తీవ్రముగఁ జూడఁగఁ బోయె నయ్యయో

క. కులకాంత నెట్లు విడచితొ
కలకాలపు చెలిమి గోసి ♦ కఠినాత్ముఁడవై
కలఁగాంచి మేలుకొనుగతి
కలవరపాటె నీదుజన్మ ♦ గన నాంధ్రులకున్

గీ. స్వర్గచిత్రము లన్ని య♦నర్గళముగ
జూచి యుండియు రాయల ♦ జూడ ననుచు
రంగరాయార్యరత్నము ♦ భంగపడక
ధర్మపథమున బెట్టి యాంధ్రుల ♦ నిర్మలాత్మ

బులుసు - రామజోగిరావు

---

సీ. ఉదయ మొందినదాది ♦ సదమలశాంతిస్వ
భావవృత్తిని మించి ♦ వాసిఁ గాంచి,
క్రమముగ ఘనులసం♦గతిఁ గూడి, సన్మార్గ
వర్తన గహియించి ♦ ప్రభ వహించి,

దినము దప్పక భువిఁ ♦ దెలివొందఁ గావించి,
సకలప్రపంచముల్ ♦ సంతరించి,
ఎక్కార్యకరణ♦తుత్వంబుఁ దల నుంచి,
విబుధుల నొక్కఁడై ♦ వినుతి మించి,

గీ. విమలనిజశక్తి నొసఁగితే ♦ విభవ మలరఁ
గువలయామోదకరమయి ♦ కొలలుమండ
వినుతవిజ్ఞానచంద్రిక ♦ వెలయ, మిత్ర!
ప్రబలి నేఁడ స్తమించితే ♦ రంగరాయ

సీ. శ్రీభాష్యనగరాన ♦ జెలఁగెడిసద్గ్రంథ
శాల నీనామంబుఁ ♦ జాటుచుండ,
సులలితవిఖ్యాతిఁ ♦ గల యాంధ్రపత్రిక
యనిశంబు నిన్నుఁ గొని♦యాడ మండ,
విద్యావాలమా ♦ విజ్ఞానచంద్రిక
నీకీర్తిపొండిమి ♦ నెఱపుచుండ,
సమాకారిమవర్తులౌ ♦ సజ్జనానీకంబు ●
బొల్లఁగా నిన్ను చే♦రొక్కనుచు నుండ,

గీ. జనుల నందించుఁ గీరరా♦జంబుపొబగుఁ
గనక, క్రుంగెడిబావురు♦గానిపగిది,
పిట్టపిడుగున నినుమిత్తి ♦ పట్టె, సకట!
ప్రథితసుగుణనికాయ, శ్రీ♦రంగరాయ

సీ. స్త్రీవిద్య యన్న ని♦స్సీ యని కుటిలతఁ
బెనుబాముబలె బుస♦బెట్టుచుండు,
వరలు విద్యాగౌర♦వం బింతయును లేక
కడఁగి కుక్కలతీరుఁ ♦ గవియుచుండఁ,
పరమహోన్నతిఁ గాంచి ♦ భరియింప నోపక
గుంతినక్కలతీరుఁ ♦ గూయుచుండ

బాలవితంతుల♦వైవాహికము లన్న
చిల్లికైపెలతీరు ♦ చీఁగుచుండ,
గీ. కుజనసంతతినాలుకల్ ♦ గోసి, కట్టె
పెటలం బెట్టి, కాల్పింప ♦ కిట్టిధర్మ
వృత్తి మృత్యువు నిను వాతఁ ♦ బెట్టుకొనియె
ప్రకటశోకాబ్ధి మము ముంచి ♦ గంగరాయ

సీ. భవదీయధార్మిక♦వర్తనాకళలకు
సుజనుఁడౌ లక్ష్మణ♦సూరి సాక్షి,
భవదీయశాంతసం♦పత్ప్రభావమునకు
ధీయుతు లక్ష్మీప♦తి యొక సాక్షి,
భవదీయవైరాగ్య♦భాగ్యసంపత్తుల కా
ర్యుండు శ్రీసోమనా♦థుండు సాక్షి,
భవదీయకరుణార్ద్ర♦భావసుస్తులకు శ్రీ
వేంకటరంగభూ♦విభుఁడు సాక్షి,
గీ. ఇట్టిసాక్షులు హృదయంబు ♦ లేఁపుచుండఁ
వెక్కువృత్తాంతపత్త్రిం ♦ ల్బెరొక్కనంగ,
కుడిభుజము పోయె నని హితు ♦ ల్గోడుఁ గుడువఁ
బాసితే మమ్ము రంగరా♦యాసుమిత్ర

సీ. సదవ నాశ్వత్థవం♦శంబుఁ జెల్వొందెనే
ప్రవిమలచతురక్షు♦రములవలన ?
సత్సంఘసంగతి♦స్థైర్యంబు వెలసెనే
ప్రవిమలచతురక్షు♦రములవలన ?
దారాసుతుల పెన్ని♦దానమై యొప్పెనే
ప్రవిమలచతురక్షు♦రములవలన ?
బంధుమిత్రులపాలి ♦ భాగ్యమై తనరెనే
ప్రవిమలచతురక్షు♦రములవలనే ?

గీ. అట్టిపావన మగుచతు♦రక్షురిగల
నీదుసన్నామమాత్రంబు♦నియతిఁ జెడక
రంగరాయా యటం చంత♦రంగమందుఁ
దలఁప మోక్షంబుఁ గరతలా♦మలకి మయ్య

మున్నంగి-లక్ష్మీనరసింహాచార్యులు

---

క. హా! రావిచెట్టువంశ
క్షీరాంబుధిజాలశశి♦కిరణోపమ ని
స్సారం బని సంసారము
వేగఁ బోయితివె స్వర్గ♦సీమల కకటా

శా. హా! విద్వజ్జనమండలీవినుత దా♦నౌదార్యసంపత్ ఖనీ
హా! వైజ్ఞానిక చంద్రికాంకుర ఫల♦ప్రారంభ చింతామణీ
హా! విశ్వంభర సేవనప్రవణచి♦త్తాంభోజ సంవిన్నశే
హా! విఖ్యాతశిరోమణీ గుణమణీ♦ హా రంగరాయాగ్రణీ

మ. వ్యాధి నొప్పారుసఘోరశస్త్రముల ఘా♦ర్తిం గాంచగాలేదు సం
పదలెన్ పక్కువ దీరగా ననుభవిం♦పన్ లేదు తేజంబుతో
నుదయం బందినతత్క్షణంబ రవిరా♦హుగ్రస్తుఁ డౌనూడ్కి ము
ప్పదిరెండేండ్లకె యేండ్లు నిండి మృతిసం♦ప్రాప్తించెనో నీ కయో

గీ. మాతృదేశాభివృద్ధిసం♦పాదనమున
కెన్ని యో సాయము లొనర్ప ♦ నెంచి యుండి
హైందవాంధ్రులదౌర్భాగ్య♦మున వారాత్తు
గా నకాలంపునిధనంబు ♦ గాంచితకట

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లి♦యాడిన సుచరిత్ర
నిల్లాలి నెట్టు త్యా♦జించినావు
శైశవం బాది నే♦స్తము నిచ్చినట్టినె
హితకోటి నేమి గా♦వించినావు

తావకాభ్యుదయంబె ♦ దలపోయు బాంధవ
సంచయంబుల నేమి ♦ సల్పినావు
నీప్రాపునం దింత ♦ నిలువగోరినయట్టి
శ్రితసంఘముల నేమి ♦ జేసినావు
గీ అక్కటా రావిచెట్టన్వ♦యాంబురాశి
సోమ! రంగరాయలలామ ♦ సుగుణధామ
త్రిదశసంవత్సరములకె ♦ త్రిదశపురికి
నింతసందిని విడనాడి ♦ యేగినావు

గీ భవ్యగుణధామ! నీదగు♦ప్రాపుకలిమి
దొమ్మికేగులకరికిప్రా♦యమ్ము గాంచి
యెల్లరకు మోద మొసగుమ ♦ సెలమి మిగుల
నలరు శ్రీకృష్ణదేవరా♦యాంధ్రనిలయ
నాను కాత్మజగతి యే మొ♦నర్చినావు

మ సకలోర్వీజను లాదరింపగ గడున్ ♦ సమ్మోదసంపాదియై
రకమౌ ముద్దులుమూటగట్టుపలుకుల్ ♦ రాజిల్ల విజ్ఞానచం
ద్రిక నా నొప్పు భవద్ద్వితీయతనయున్ ♦ రెండేండ్లప్రాయంబునం
దకటా విష్ణురశాంతిన్ విడువ న్యా♦యం బౌనొకో ధీమణీ

ఉ నమ్మినవారలన్ నిరస♦నం బొనరింప వటంచు గట్టిక్షై
ర్యమ్మును గల్గి తావకన♦వాయమునం దలపెట్టి పెక్కుకా
ర్యమ్ముల సల్ప మాన నవి ♦ యన్నియు బూర్తి యొనర్పకుండ న్యా
యమ్మె సగంబునన్ విడువ♦నక్కట! ధర్మకలాప! యిందరన్

చ ఘనతరదాన్యబంధముల ♦ గాసిలుచున్న స్వదేశమాతృమో
క్షణ మసమర్ధు లౌనరుల♦సాయమునన్ నెరవేర దంచు న
త్యనుపమశేముషీవిభవు ♦ లైనసుపర్వుల వేడి వారలం
గొలి చను దేర స్వర్గమున♦కుం జనినాడవొ రంగధీమణి

గీ. కానిదో పంకభూయిష్ఠ ♦ మైనజగతి
బడి చిరంబుగ నుండిన ♦ బయలువెడల
జాల ననుబీతి నతిశీఘ్ర ♦ కాలముందె
ఇహము త్యజియించినాడవా ♦ ఇద్ధచరిత

గీ. కష్టజవుల బ్రతుకు దీ♦ర్ఘంబు బోర్చు
సులభజవుల గొంపోదు ♦ కుంఠెగోనె
దైవమా యట్టలీరు మా♦ రావిచెట్టు
వంశదీపకుఁ డేచటఁ గ♦న్పడియె నంట

చ. అనుపమదానవైభవస♦వంచితుఁ డార్యగుణుండు రంగరా
వనుచు సమస్తమార్గముల ♦ గార్తిని బొందు స్వదేశరత్నముం
బున కగుసాయ మాఘునుని♦ మూలమునం బడయంగ గొంటి మి
య్యనఘుని నిక గూడ నశ ♦ యయ్యెనె యీతనివివాదనే కటా

చ. అలఘుదయానిధాన! విభ♦వాప్తి తులంచు దలంచి భూమిపై
గలుగు సమస్తమానవుల ♦ కాళ్లను ఎట్టినలాభ మింతయుఁ
గలుగదు రంగరావుకరు♦ణ గయిగొందు భవన్మనోరథం
బు లని యొసంగి గైకొనగ ♦ బోలునె యిచ్చినవెంట నే కటా

ఉ. ఆయలదు ఖభారమున ♦ నాడెదగాక మహేశ! యం బి ఎం
సీ య ఎనంగ నొప్పెడు ప్ర♦సిద్ధివహించినయట్టివైద్య కాం
గ్లేయపరీక్షలందు సఖ♦లీకృతసర్వసమోరథుండు సు
శ్రీయుతుఁ డైన లక్ష్మిపతి ♦ చెంతనె యుండియు నిట్టు లల్ప్య సా
యాయువు దీర లచ్చినుగ♦ దైనను నే మొనరింప గల్గెదిక్

గీ. దేశమాతరో! నీదుర♦దృష్ట మేమొ
నీవిరోధులు ధర చిరం♦జీవు లగుదు
రకట! నీకయి పలుబాహు ♦ లందురారు
వడి సకాలంపుమృత్యువే♦పడయు చుందు

గీ. మాతృదేశాభిమానులై ♦ మహిని వెలయు
వా రకాలంపుమృత్యువు ♦ వారి బడదు
రని భయంబు నిరుత్సాహ ♦ మాత్మలందు
పూనకుడు దేశహితులైన ♦ పుణ్యులార

ఉ. ఏయభిలాష దేహధరు ♦ డిచ్చ దలంచి యొసగ్గ బూనునో
యాయభిలాష పూర్తిగను ♦ నంతకు జన్మముమీద జన్మముల్
బాయక గాంచుచుండు నని ♦ బ్రహ్మవిదుల్ వచియింత్రు గాన హో
ధీయుతులార! దేశహిత ♦ దీక్షుల వీడకు డించుకేనియున్

సీ. దేశీయకృషులు వి♦నాశ సందెడు వోట
వగలజేసి స్వదేశ♦వస్తుశాల
నాత్మీయ దేశ మా♦హాత్మ్యవర్ధనమునకు న
త్వరితత్తు నొకడు ప్రో♦త్సాహపరచి
అజ్ఞానతిమిరాన♦మావృతంబగు భూమి
విజ్ఞానచంద్రిక ♦ వెలయఁ జేసి
పచ్చిమల్కూల కాట♦పట్టైన హైదరా
బాదులో నంధ్రంబు ♦ నాదుకొల్పి

గీ. బహుళయశ మొంది జన్మసా♦ఫల్య మొంది
శావకానూనదివ్యప♦దంబు నొంద
వగడెంచిన రంగరా♦యాఖ్య దేశ
సఖుని యాత్మకు శాంతి నొ♦సంగు మీశ

వేలాల-సుబ్బారావు

---

ఉమేశచంద్ర బనర్జి.

# ఉమేశచంద్ర బనర్జీ

## బాల్యదశ

సర్వసంపదల కాటపట్టై, గంగాది మహానదీ మతల్లులకు విహారారామంబై, భారతమాత ఉత్తమాంగంబునాఁ బరఁగు వంగదేశమునందు మొన్న మొన్నటిదనుక బ్రిటిషు ఇండియా సామ్రాజ్య రాజధానియైయుండి, దివ్యసౌధములచే విరాజమానంబగు కలకత్తా పట్టణమున కిడ్డరుపురమునందు సద్గుణ ఖనియనియు, నీతికోవిదుఁడనియు, దయాశాలియనియు ప్రసిద్ధిఁ జెందిన పీతాంబరబనర్జి యనునాతఁడు వాసము చేయుచుండెను పీతాంబర బనర్జీ న్యాయశాస్త్రమునందు ప్రవీణుఁడయి యుండుటయేగాక కలకత్తాయందలి "కోలియర్ బర్ధు అండుకో" యను న్యాయవాది సంఘమునకుఁగూడ సంబాధించియుండెను పీతాంబరబనర్జీగారి కొమారుఁడు గిరీశచంద్రబనర్జి గిరీశచంద్ర బనర్జీ మొదట తమతండ్రిగారి కార్యాలయమున లేకరిగఁ బని చేసెను పిమ్మట క్రమముగా నిద్దఱు న్యాయవాదులయొద్ద కొంతకాలముండెను అతఁడు 1859-వ సంవత్సరమున న్యాయవాది పరీక్షలో కృతార్థుఁడై తుదకు "జడ్జి అండు బనర్జి" యను సంఘమున భాగస్వామియాయెను ఈ గిరీశచంద్రునకు 1844-వ సంవత్సరము డిశంబరు నెలలో కిడ్డరు పురమునందు రెండవకుమారుఁడు జనించెను ఈ ద్వితీయ పుత్రరత్నమే అద్వితీయ ప్రతిభా విశేషములచేత వన్నెకెక్కిన మన కథానాయ

కుఁడు ఈ విధమున ఉమేశచంద్రుఁడు శాస్త్రపారంగతుల వంశమందుదయించి, శాస్త్రవిశారదుల మధ్యఁ బెరిఁగెను కాని గొప్పవాఁడగుటకుఁ గావలసిన మేధాసంబంధములయిన లక్షణము లెవ్వియు శైశవమం దితనియందు కనుపడలేదు విద్యార్థిగానున్న కాలమందను నితఁడింత గొప్పవాఁడగు ననుటకు సూచనలు గాన్పించలేదు

## విద్యాభ్యాసకాలము

ఉమేశచంద్రుని విద్యావిషయమై తలిదండ్రు లంత శ్రద్ధతీసికొనినటులు గనుపడదు అతఁడు మొదట "ఓరియంటల్ సెమినరి" పాఠశాలయందును తరువాత హైందవ పాఠశాలయందును ఆరంభ విద్యనుమాత్రము గఱచెను. కాని తనపదునేడవ యేఁటననఁగా 1861 సంవత్సరమున ప్రవేశపరీక్షకుఁ జదువుచుండఁగా తండ్రియానతిఁ జదువుచాలించి "డబ్ల్యు పి డౌనింగు" అను వానివద్ద గుమాస్తాగానుండెను మఱుసటి సంవత్సరమున "డబ్ల్యు ఎఫ్ గాలెండర్సు" గారి కార్యాలయమునఁ బ్రవేశించెను ఈ సమయముననే, భవిష్యత్కాలమున నెక్కువ యుపయోగకారియై ప్రఖ్యాతికిఁదెచ్చిన దానవిక్రయాది పత్రలేఖనమును, సకారణములతో వాదించువిధమును, నేర్చుకొని వానియందు పరిపూర్ణ ప్రజ్ఞావంతుఁడయ్యెను. ఈ సమయముననే దేశసేవ చేయవలెనను కుతూహలముదయింప నితఁడు దేశభక్తుఁడైన బాబుసురేంద్రనాథ బనర్జిగారిచే ఇప్పుడు నడుపఁబడుచున్న "బంగాలి" యను పత్రికా రాజమును స్థాపించెను

ఇట్లుండ నింగ్లండునకు వెళ్లి ధర్మశాస్త్రాభ్యాసము చేయఁ దలఁచు విద్యార్థి సాహాయ్యార్థమై బొంబయినగరమున కీర్తి శేషులగు రస్తుమ్జీ జేమ్సెట్జీయను పారసీ మహనీయుఁ డొక విద్యార్థివేతనమును స్థాపించెను ఆవేతనముకొఱకు జరిగిన పోటీపరీక్షకు యత్నించినవాఁడై, అటులయత్నించిన యయిదు గురిలో మొదటివాఁడుగఁ గృతార్థుఁడయ్యెన ఈవిద్యార్థ వేతనమును స్వీకరించి యింగ్లండునకువెళ్లి అచ్చట 'మిడిల్ టెంపుల్' అనుసర్వకళాశాలయందు ప్రవేశించి బ్యారిష్టరు పరీక్షకు చదివెను ఉమేశచంద్రుని జీవితమునందిప్పుడే క్రొత్త శకము ప్రారంభించినదని చెప్పవచ్చును ఏలయన నింతవఱకు నిర్లక్ష్యముగాఁ జూడఁబడుచుండిన ఈకుఱ్ఱవాఁడు నిజమైన పరిశ్రమోపేతుఁడయ్యెను బ్యారిష్టరు పరీక్షకొఱకుచేయు విద్యాభ్యాససమయముననె ఇతనికి నదృష్టవశమున సుప్రసిద్ధులగు టి హెచ్ డార్టు, ఎడ్వర్డు ఫ్రైయను న్యాయవాదుల సహవాసము లభించెను హిందూదేశోద్ధారణకై రాజకీయవిషయములలో ముందు ఇతనితో పనిచేసి కష్టసుఖములయందు సమానముగా పాలుపంచుకొనిన మహమ్మదీయ కులశేఖరుఁడగు బదురుద్దీన్ తయ్యాబ్జి సహపాఠియయ్యెను ఇట్టి సజ్జనసాంగత్యముతో కాలముగడపి ఉమేశచంద్రుఁడు తాను పూనినకార్యమును జయప్రదముగ సాధించెను న్యాయశాస్త్రము నభ్యసించుచు, ఇండియా రాజకీయ విషయములను గూర్చి ప్రబలముగ చర్చించుచు మహోపకార మొనర్చుచున్న "లండన్ ఇండియా సంఘ" స్థాపనములో బహుశ్రద్ధవహించి పనిచేసెను ఈరీతిగ

నితఁడు తన కార్యములను ముగించుకొని మాతాపితలు, బంధు లోకము, మిత్రబృందము లమందానందముతో స్వాగతమియ నెదురు చూచుచుండ మాతృదేశమునకు మరలెను.

## న్యాయవాదిత్వము

1867-వ సంవత్సరమున కలకత్తా ఉన్నతన్యాయసభ (High Court) యందు నితఁడు న్యాయవాదిగాఁ జేర్చుకొనఁబడి 1868 సంవత్సరమునుండి పనిచేయ నారంభించెను.

అతని గొప్పమేధాశక్తియు, అకృత్రిమమగు పరిశ్రమయు, ఉల్లాసముగనుండు మనస్సును, ఇవన్నియు తొలుత పొందిన శిక్షణతో నేకీభవింప బనర్జీ బ్యారిష్టరులలో శిరోమణియయ్యెను. ఇతని కాలమందు మైకేల్ మధుసూదనదత్తు, మానమోహన ఘోష్ అను హైందవబ్యారిష్టరులు ఇద్దఱేయుండిరి. వారిలో నొకరివృత్తియందెక్కువ యభినివేశముతో పనిచేయలేదు. మఱి యొకరు పరస్థలములందలి క్రిమినల్ వ్యవహారములయందె శ్రద్ధతీసికొనుచుండిరి. ఈవిధముగా తనవృత్తికి పోటీవచ్చు హిందువులెవరును లేక పోయినను కొద్దిపరీక్షనిచ్చిన వకీళ్లలోఁ గొందఱుమాత్ర మితనియందీర్ష్య వహించియుండవచ్చు. వారంట కాని మన కథానాయకుఁడెంత మాత్రము దానిని పాటించి యుండలేదు.

ఉమేశచంద్రుఁడు న్యాయవాది పనియందింక ప్రవేశించు నంతలోనే తండ్రియగు గిరీశచంద్రబనర్జి కాలముచేసెను. ఉమేశ చంద్రుని బంధువులలోను స్నేహితులలోను పెక్కుమంది న్యాయవాదివృత్తి గలవారలై యుండిరి. వీలుగా నున్నపుడెల్ల నర్థా

లగు తనక్రింది వకీళ్లకును, ఆంగ్లేయవకీళ్లకును, సంతోషముతో సాహాయ్యము చేయుచుండెడివాఁడు ఈతని తెలివి తేటలను గమనించి దొరతెనమువారు న్యాయవాదిగ (Standing Counsel) నాలుగు సంవత్సరములవఱకు నేర్పఱచుకొనిరి అనంతరము న్యాయాధిపత్య పదవిఁగూడ నొసఁగఁదలఁచిరి కాని మన దేశ భక్తాగ్రేసరుఁ డంగీకరింపఁడయ్యెను నిష్పాక్షిక విమర్శకు లయిన దేశభక్తబాబుసురేంద్రనాథబనర్జీయును రాబర్టునైటు * అను వారును దేశాభివృద్ధికై పరిశ్రమ చేయుచుండిరి వీరు గావించుపనుల కెంతయు సంతసించి ఉమేశచంద్రుఁడును వారి తోకలిసి పనిచేయనారంభించెను న్యాయవాదిపనిలో అకోర్టు నందు నీతనినిమించినవాఁడు మఱియొకఁడు లేకుండెను అసలు వ్యాజ్యములలో పనిచేసినిర్వహించెడి వాఁడితఁడొక్కఁడే జడ్జీలు, వకీళ్లు, బ్యారిష్టరులు, వ్యాజ్యపుదారులు, ఇతనియందే యెక్కువ నమ్మికఁగలిగియుండిరి మొత్తముమీఁద వకీలుగా నీతని నడత మిగుల సంశ్లాఘనీయ మయినదని చెప్పవచ్చును. ఇతర వకీళ్లకంటె నీతని యాదాయమే హెచ్చుగా నుండెడిది సుప్రసిద్ధులగు రమేశచంద్రదత్తాదులు బనర్జీనిగూర్చి యుత్తమాభిప్రాయము లిచ్చియుండిరి ఉమేశచంద్రబనర్జీ ధర్మశాస్త్ర

---

* రాబర్టునైట్ కలకత్తాయందలి స్టేట్సుమెన్ అను పత్రికకు స్థాపకుఁడును, సంపాదకుఁడును అయియుండెను నైటుగారు సంపాదకులుగా నున్నంతకాలము స్టేట్సుమన్ పత్రిక హిందువులపక్షమూని ఇండియావృద్ధికై పనిచేయుచుండె అప్పుడు బంగాళీవార నేకులు దానిని ప్రేమించుచుండిరి కాని రానురాను పత్రికోద్దేశముమారి హిందువులపై లేనిపోని దోషారోపణ చేయుచు ఇప్పుడది మనకుఁ బ్రతికూలముగ మెల్లఁగుచున్నది

పారీణుఁడును, ప్రతివాదిభయంకరుఁడును, దిట్టరియగు లేఖకుఁడును, సత్యపధాను వర్తియునైన న్యాయవాదులలో నాయకమణిగా విరాజిల్లెను

## హిందూ దేశీయ మహాసభ

### ఉత్పత్తి

కాలపరిణామము ననుసరించి తమ యాధిపత్యములోనికి వచ్చిన మన దేశమును బ్రిటిషు మహాజనులు న్యాయసమ్మతముగ పరిపాలనచేయఁ గడంగిరి నాగరికతాభివృద్ధిఁజెందిన ఇతర దేశములలోని పరిపాలనా పద్ధతులను నెలకొల్పిరి ప్రపంచమునం దెచ్చటఁజూచినను తానయై విహారము చేయుచున్న ఇంగ్లీషు భాషయొక్క మాధుర్యమును మనముకూడ గ్రోల నవకాశమిచ్చిరి ఇట్లెన్నివిధముల వారు పాటుపడుచున్నను, హిందూదేశమునకు వారు క్రొత్తవారయినందునను, హిందువుల మనోభీష్టములను గ్రహింపలేక పోవుటవలనను, రాజ్యాంగమునందు కొన్నిలోపములు సంభవింపఁ జొచ్చెను ప్రపంచమునందు సంపూర్ణ నిర్దుష్టత్వమును బొందిన వస్తువుండుట యస్వాభావికము గదా? న్యాయవిరుద్ధములగు విధులను సవరింపించి హిందూదేశమునకును, ఇంగ్లాండునకును మైత్రిని బలపఱుచుటయును, హిందూదేశీయులకు రాజ్యాంగ విషయములను బోధించి రాజకీయ స్వాతంత్ర్యమునకర్హులుగఁ జేయుటయును ప్రజానాయకులకు ముఖ్య కర్తవ్యమయ్యెను ఇట్టి కొఱఁతను నివారింపఁగంకణముఁ గట్టుకొని బయలుదేరినదియే హిందూదేశీయ మహాసభ (Indian National Congress)

ఈసభాస్థాపనకారకులలో ముఖ్యుఁడు మన ఉమేశచంద్ర బనర్జియే బనర్జీ చేసిన ఇతర కార్యములకంటె కాంగ్రెసు వృద్ధికై చేసినకృషిచేతనే మనకెక్కుడు సంస్మరణీయుఁడుగనున్నాఁడు

కాంగ్రెసుయొక్క ఆవశ్యకమును గూర్చియు, దానియుత్పత్తిని గూర్చియు, ఉమేశచంద్ర బనర్జియే వక్కాణించియున్నాఁడు దానినేనిచట సంగ్రహముగ వ్రాసెదను

"హిందూ దేశీయమహాసభ రాజప్రతినిధిగా నుండిన మార్క్విస్ ఆఫ్ డఫ్రిన్ అండ్ ఆవా గారిచే ప్రతిష్ఠాపింపఁబడినదను సమాచారము అనేకులకు దెలియవలసిన అంశము హిందూస్థానములోని రాజనీతిధురీణులు సంవత్సరమున కొకసారి సమావేశమయి, దేశాభివృద్ధి కరములగు ననేకవిషయములఁ జర్చించుచు తద్వారా ఐకమత్యశ్రీయుతులై యేకాభిప్రాయులై యుంట చాలలాభకరమని యొకయూహ ఏ ఓ హ్యూంగారికి 1884 సంవత్సరమునందు పొడమెను ఈవార్షిక చర్చలలో రాజకీయ విషయములఁ జేర్చుట హ్యూంగారి యభిప్రాయముకాదు ఏలయన కలకత్తా, బొంబయి, మద్రాసు మున్నగుపట్టణము లందును ఇంక నితరప్రదేశములందును, దొరతనమువారిసమ్మతిఁబొందిన రాజకీయవిషయముల చర్చించు సంఘములున్నందున నూతనముగ నేర్పాటుచేయఁబోవు వార్షికసభలయందు రాజకీయవిషయములు చర్చించుటచే పైసంఘముల ప్రాముఖ్యత తగ్గునని యాతఁడు తలంచెను ఇదిగాక నీ సభలు రాజధానినగరమునందు జరుగుచుండవలెననియు, దానికి యాప్రదేశపు గవర్నరుగారధ్యక్షులుగా నుండవలెననియు సభి

ప్రాయపడెను. ఇట్టి కోర్కెలతో హ్యూముగారు రాజప్రతినిధి గారివద్దికివెళ్ళి వారికిది నివేదించెను. కాని డఫ్రిన్ దొరగారు, హ్యూముగారి యాలోచన సరిగాలేదనియు, ఇండియా యందు బహుజను లింగ్లీషురాని వారగుటచే, ఇంగ్లీషువారగు తమ పరిపాలనలో లోపములుండిన నుండవచ్చుననియు, అట్టి లోపము లధికారియెదుట నుగపువిప్పి మాటలాడుటకు జనులు వెఱతురనియు, గవర్నమెంటుకు సంబంధములేకుండ రాజకీయ తత్వజ్ఞులందఱు గుమిగూడి లోపములను చూపుచు పనిచేసిన మేలుగా నుండుననియు సెలవిచ్చిరి.

తనపద్ధతికంటె వైసురాయ్‌గారి పద్ధతి బాగుగానున్నదని యొప్పుకొని హ్యూముగారు హిందూనాయకుల యెదుటఁబెట్టెను. మేమందఱము రాజప్రతినిధిగారి పద్ధతినే యామోదించితిమి. కాంగ్రెసుతో హ్యూముగారికి సంబంధముండినటుల హ్యూముగారీదేశములో నుండువఱకుఁ దెలియఁగూడదని వైసురాయ్‌గారు కోరినందున ఈసంగతి మొన్న మొన్నటివఱ కెవ్వరికిని దెలియదు. మాలో కొంతమందికి మాత్రమే తెలియును. ఇది కాంగ్రెసు ఉత్పత్తి."

## మొదటి కాంగ్రెసు

ఇట్లు ప్రతిసంవత్సరము నొకసభ జరిపి రాజకీయ విషయముల చర్చించి దేశాభివృద్ధికి పాటుపడుటకును, పాలకులకు పరిపాలనావిధాన నిర్ణయమున తోడుపడుటకును కృతనిశ్చయులై యదిమొదలుకొని 1885-వ సం॥ రమునందు మొదటి సభ జరుప మనప్రజానాయకులు ప్రయత్నములు చేయఁదొడఁగిరి.

ఈ మొదటిసభకు బొంబయినగరము తగిన ప్రదేశముగా నేర్పాటుచేసిరి హిందూదేశములోని పలుచోటుల నుండి రాజకీయ జ్ఞాన విశారదులు సుమారు నూరుగురు విచ్చేసియుండిరి నూతనముగా వెలువడిన ఈ సభాకార్యముల నిర్వహించి తదుద్దేశముల వివరముగా బోధచేయు పురుష శార్దూలము ఉమేశచంద్ర బనర్జియే యని సభవారు తలంచిరి

ఆహా! ఉమేశచంద్రుని యదృష్ట మేమనవచ్చును! సుప్రసిద్ధులగు ఏ ఓ హ్యూంగా రుపపాదింప, (న్యాయమూర్తి) ఎస్ సుబ్రహ్మణ్య అయ్యరు ఆమోదింప, గౌరవభాజులు కాశీనాథత్ర్యంబక తెలాంగుగారు అనుమోదింప, సభయంతయు కరతాళధ్వనులతో మాఱుమ్రోయ రాజనీతి పారంగతులతో కలకలలాడుచున్న యీసభకు ఉమేశచంద్ర బనర్జీ అగ్రాసనాధిపత్యమును వహించెను ఇతఁడు అగ్రాసనాధిపతిగానిచ్చిన యుపన్యాసము కొద్దిదైనను, చర్చనీయాంశములతో నిండి మనసునకు నాటునట్టుండెను

ఉమేశచంద్రుఁడు కాంగ్రెసుకూడ నొక ప్రతినిధి సభయని వాదించెను ఇంగండులోని ఆంగ్లేయ ప్రజాప్రతినిధి సభ (House of Commons) వంటిదికాక పోయినను, హైందవజన సంకల్పములను, భావములను, కోరికలను, దెలుపునట్టిదియని చెప్పెను ఇట్టి సభయొక్క ఉద్దేశము లివియని తానే వెల్లడి చేసియున్నాఁడు

1 స్వదేశాభివృద్ధికై యభినివేశముతో పాటుపడు హిందూదేశీయు లందఱును ఒకరినొకరు తెలిసికొని పరస్పరానురాగభరితులై యుండుట

2 దేశభక్తుల యన్యోన్య సంసర్గముచే ఒకరొకరికిఁ గల కుల, మత, స్థలదురభిమానముల నన్నింటిని నిర్మూలనముచేసికొని రిపన్ ప్రభువుగారి ప్రభుత్వకాలములో జనించిన ఏకజాతీయ భావమును పూర్ణముగా వికసింపఁజేయుట

3 ముఖ్యమైనట్టియు, ఆవశ్యకము లయినట్టియు, సాంఘిక విషయములను, ప్రౌఢాభిప్రాయములుగల ఇండియా గోని కోవిదులు చర్చించి ప్రామాణికమైన యాసారాంశమును గ్రంథస్థము చేయుట

4 ముందువచ్చు పండ్రెండుమాసములలో జనసామాన్యలాభము నిమిత్తమై హైందవరాజ్యతంత్రజ్ఞు లేయే పద్ధతుల మీఁద పనిచేయవలయునో నిశ్చయించుట

ఉమేశచంద్రుఁడు బ్రిటిషుప్రభుత్వమునం దెక్కుడుభక్తివిశ్వాసములు గలవాఁడు కాంగ్రెసు, కుట్రకారుల యొక్కయు, రాజద్రోహుల యొక్కయు సమాజమని దాని ప్రతిపక్షులు నుడువసాగిరి కావున నెమ్మదికలుగఁజేయుట, అయోమార్గములు నిర్మించుట, అమూల్యమగు పాశ్చాత్యవిద్యను గఱపుట మొదలగు సత్కార్యములచేత హిందూదేశమునకు బ్రిటిషు ప్రభుత్వము వలన ఎక్కువమేలు కలిగినదనియు, హిందువు లిందుకు ఇంగ్లండునెడ కృతఘ్నులు కాఁజాలరనియు, ఆసభలో సమావేశమయిన తమకన్న ఎక్కువ రాజభక్తి గలవారుండ

రనియు తన ప్రసంగములో వక్కాణించియుండెను ఇట్లు చెప్పు టచే హిందూదేశీయులందఱు ఇగ్లండునే నమ్ముకొని యింగ్లండు మీఁదనే యాధారపడి స్వదేశమునకయి సలుపవలసిన తమ కర్తవ్యమును మఱవవలసనదని యతని యభిప్రాయముకాదు కావున దేశాభివృద్ధికి ఆవశ్యకములగు విద్యా పరిశ్రమాదులు విద్యార్థికులు పెంపుఁ జెందింపవలెననియు, అప్పుడే రాజకీయ విషయములలో ప్రవీణతయు, రాజకీయ స్వాతంత్రేచ్ఛయు కలుగుననియు శాసించెను

ఐరోపాయందు ప్రాబల్యముగనిన రాజ్యాంగ పద్ధతుల ననుసరించి తాము నేలఁబడవలెనని కోరుట ఏమాత్రము బ్రిటిషు ప్రభుత్వమునకుఁ జూపఁదగిన పరమ రాజభక్తికి విరుద్ధము గాదని యతఁడభిప్రాయపడెను ప్రభుత్వముయొక్క పునాదుల విశాలము చేయుటయు, పరిపాలనయందు క్రమమైనట్టియు, న్యాయమైనట్టియు హక్కుల జనులు కలిగియుండుటయు హైందవుల పరమావధియని వచించెను ఇదియే యాతని కాంగ్రెసు వ్యాసముయొక్క సారాంశము

## రెండవ కాంగ్రెసు

రెండవ కాంగ్రెసు మహాసభ 1886 సం॥ రమున కలకత్తా నగరమందు జరిగెను ఈ సభ జయప్రదముగ నెరవేరుటకై మనబనర్జీ యత్యంత శ్రద్ధవహించి పనిచేసెను ఆకాలమందు క్రిమినల్ వ్యవహారములలో పంచాయతీదారులతోఁ దాము నేకీభవించనితరి పరిష్కారార్థమయి హైకోర్టువారికి పంపునధికారము మండలన్యాయాధిపతుల కుండెడిది ఈ పద్ధతిప్రజల

స్వాతంత్ర్యమునకు చాల భంగకరమయినదని ఎంచి ‘ హిందూ దేశమందు పంచాయతీ పద్ధతి ’ యను నొక తీర్మానమును చర్చనీయాంశములలోఁ జేర్పించి పంచాయతీదారులయభిప్రాయానుసారముగ తీర్పు చెప్పుట మండల న్యాయాధికారుల కర్తవ్యమని తీర్మానింపంచిరి ఈ తీర్మానమును ఉమేశచంద్రుఁడే యుపపాదించెను

## మూఁడవ కాంగ్రెసు

1887-వ సం॥రమునందు మద్రాసులో సమావేశమయిన తృతీయసభ చాలముఖ్యమైనది ఏలయన నప్పుడు బదురుద్దీన్ తయాబ్జియను మహమ్మదీయుఁ డగ్రాసనాధిపత్యము వహించెను ఆకాలమందు కాంగ్రెసు హిందూ కుట్రికారుల సభయనియు, మహమ్మదీయులకు దానితో సంబంధము లేదనియు కొందఱు నుడువసాగిరి భారత పుత్రులలో నిటుల భేదాభిప్రాయము లుదయించుట ఉపద్రవకరమనియు, కాంగ్రెసు ఒక హిందువుల దేగాక భరతఖండములో నివాసులుగానున్న పలు తెగలవారి యున్న తికొఱకు పాటుపడునదియనియు తెలియఁ జేయుటకై మన ఉమేశచంద్రుఁడే తన స్నేహితుఁడగు బదురుద్దీన్ తయాబ్జియను మహమ్మదీయుని అగ్రాసనాధిపతిగా నుండఁగోరెను ఈ కాంగ్రెసునందే ‘ సైనికవిద్యాలయము ’ లను (Military Colleges) గూర్చిన విషయమును తీర్మానింప వలసివచ్చినపుడు సభ్యులలో నొకఁడు ‘ హిందూదేశీయుఁడు ’ అను పదమును వివరించునదని కోరెను అప్పుడు కాంగ్రెసును గూర్చి పలు తెగలవారికి గల సందేహము మాపుమాయునట్లు వచింప వల

సినదని అగ్రాసనాధిపతిగారు గోరఁగా బనర్జి సమయమును పుర స్కరించుకొని 'హిందువులు, మహమ్మదీయులు, పారసీలు, యురేషియనులు, ఈస్టు ఇండియనులు, శాశ్వత నివాస మేర్ప ఱచుకొనిన యూరోపియనులు, ఇట్టివారికి జనించినవారు, వీరం దఱు న్యాయశాస్త్ర రీత్యా భారతీయులే' యని నొక్కి వక్కా ణించెను

## నాల్గవ కాంగ్రెసు

మూఁడవ కాంగ్రెసు ముగియుటతోడనే ఉమేశ చంద్రుఁడు ఆరోగ్యము కొఱకు నింగ్లాండునకు వెళ్లెను అచ్చటఁ గొంతకాల ముండి నాల్గవకాంగ్రెసుఁ జూచుటకు బయలుదేఱి స్వదేశమునకు వచ్చెను ఈకాంగ్రెసు 1888 సంవత్సరములో డిసెంబరు మా సాంతమందు అలహాబాదు (ప్రయాగ) లో సమావేశమ య్యెను దీనికి ఆంగ్లేయహైందవుఁడగు (Anglo-Indian) జార్జి యూల్ గారగ్రాసనాధిపత్యమును వహించిరి

అగ్రాసనాధిపతులగు యూల్ గారేమి, సన్మానసంఘాధి పతులగు పండిత అయోధ్యనాథ్ గారేమి, మనబనర్జీగారి వలననే ప్రోత్సాహముఁ బడసినవారలై పైపదవుల స్వీకరించిరి కాం గ్రెసుఇప్పటికి మూఁడుసంవత్సరములనుండి పనిచేయుచుండెను దొరతనమువారు కాంగ్రెసు ఉద్దేశముల బాగుగ గ్రహించి, దాని తీర్మానముల ప్రకారము పరిపాలనలో మార్పులుచేయ వలెనని అందఱివారు గోరుచుండిరి కానిదొరతనము వారు బాగుగ గమనించని కతమున అనేకులకు నిరుత్సాహము గలి గెను కావున వారలు ఉత్సాహవంతు లగునటుల ఉపన్యా

సించి మనము ప్రతిసంవత్సరముచేయు కాంగ్రెసు తీర్మానముల నిండియాలోని, ఇంగ్లండులోని దొరతనముల వారికి పంపుచుండ వలెననియు, మనకోరికలు మితముగను మనము శాంతులుగను మనముచేయు కర్జము న్యాయబద్ధమైనదిగను ఉండవలెననియు, అప్పుడు విజయమును బొందుట కెట్టి సందియము లేదనియు, అధైర్యపడుట అనవసరమనియు, కొంచెము కొంచెముగ మొదలిడి క్రమేణ వృద్ధిపఱచుచు ప్రయత్నించినయెడల కొలఁది కాలములోనె విజయసౌధమును జేరవచ్చునని యుమేశ చంద్రుఁడు నొక్కి పలికెను

## ఐదవ కాంగ్రెసు

ఐదవ కాంగ్రెసు మహాసభ (1889) బొంబాయి నగరము నలంకరించెను విఖ్యాతయశులగు సర్ విలియం వెడ్డర్ బర్న్ గారు ఆధిపత్యమువహించిరి దేశభక్త సర్ ఫిరోజిషా మెహర్వాంజీ మెహతాగారు స్వాగత సభాధిపత్యమును వహించిరి రాజకీయ తత్వవిశారదుఁడును, మనదేశమునకు మేలుచేయవలెనని పార్లమెంటు నందు పోరాడినవాఁడునునగు 'చార్లెసు బ్రాడ్లా' గారు మనదేశీయుల మనోభావముల గ్రహించుటకును, ఇండియా రాజకీయ విషయముల బోధపఱచుకొనుటకును ఇంగ్లండునుండి విచ్చేసి ఈసభనలంకరించి యుండిరి ఇట్లు బ్రాడ్లాగారిని రప్పించినదికూడ మనకథానాయకుని ప్రోత్సాహమేయని చదువరులు తెలిసికొందురుగాక!

ఉమేశచంద్రుని భక్తివిశ్వాసములు కాంగ్రెసు వారెఱింగి యున్నందున, అగ్రాసనాధిపతిగారిని ఆసనమలంకరింపఁగోరు

తీర్మానమును ఉపపాదించు గౌరవము మన కథానాయకునకే కలుగఁజేసిరి అంత నిందు సభలో నింతకన్న నెక్కువ గౌరవ మేమికావలయును ?

సర్ విలియంవెడ్డర్‌బర్న్‌గారి అధిపత్యము నామోదింపఁ గోరుచు, నవ్వు పుట్టించునదిగను చమత్కారముగను నుండు నటుల నీతఁడిచ్చిన ఉపన్యాసము నీక్రింద వివరించెదను

"కాంగ్రెసు పుట్టినదాదిగా నేఁటివఱకు సభను అలంక రించిన సభాధిపతులను గూర్చి విచారించిన, సర్ విలియంగారి యెన్నిక ఒకవిధమైన నిర్ణయాను సారముగా నిశ్చయింపఁబడె నని మీకుఁ దోఁచఁగలదు

1885 సంవత్సరము నందు జరిగిన ప్రథమసభ యంతగా ముఖ్యమైనదికాదు. అత్తఱి వీరలొక అల్పజ్ఞుని యధిపతిగా నెన్నుకొనియుంటిరి అద్వితీయదేశాభిమానియు, ఇండియాకు మేలుచేయ పార్లమెంటు సభ్యత్వమునకై వృద్ధుఁడైనను పడుచు వానివలె ధైర్యోత్సాహములతో పాటుపడు వాఁడును, పారసీ కులతిలకుఁడును, అగు దేశభక్త దాదాభాయినౌరోజిగారు రెండవ కాంగ్రెసున కధిపతులయిరి హిందూదేశమున కాంగ్రెసునుగూర్చి వ్యాపించిన దురూహలను నిర్మూలించుట కును, అందు ముఖ్యముగా మహమ్మదీయుల సుముఖులఁజేయుట కును, వకీళ్లయందు నాయకమణిగా విరాజిల్లుచున్నట్టియు, సక లాంశములందు దారితేరిన ప్రజ్ఞావంతుఁడయినట్టియు మహమ్మ దీయుని అగ్రాసనాధిపత్యముక్రింద మూఁడవసభ జరిగినది మన మింతవఱకు ఆచరించిన క్రమము ప్రకారము తరువాతి యగ్రా

సనాధిపతి యురేపియన్ సంఘమునకుఁ జెందినవాఁడు కావలసి యుండెను కాని యగ్రాసనాధిపతిగా నెన్నికొన బడుటకు యోగ్యత గలిగినట్టియు, దేశమంతయు నేకవాక్యముగాఁ గోరు నట్టియు, డి ఎస్ వైట్ గారు అనారోగ్యస్థితిలోనుండియుండిరి అట్టిస్థితిలో వారికిబదులు ఇంకొకయు రేపియనును నేర్పఱుచుట భావ్యము కాదని తలంచితిమి దురదృష్టవశమున వారిప్పుడులేరు వైట్ గారి మరణమువలన భారతమాత ఒకపుత్రరత్నమును గోల్పోయినది' వైట్ గారుతప్పిపోయినందున,ఇంకొకసంఘము-ఆంగ్లేయహైందవసంఘము (Anglo Indian Community)-వైపు చూడవలసి వచ్చెను గౌరవనీయులగు జార్జియూల్ గారు మనకు నాల్గవకాంగ్రెసు అధిపతిగానుండిరి వీరినిగురించి నే నెక్కువగాఁ జెప్పవలసినపనిలేదు కాని యుపకారవేతనము గైకొని ఇంగ్లండునకు వెళ్లినదాదిగ తనకాలమును,ద్రవ్యమును, కాంగ్రెసు అభివృద్ధికై ఇతఁడు వినియోగించుచున్నాఁడని చెప్పి నఁజాలును సభాధ్యక్షునకై దొరతనమువారి ఉద్యోగులుకాని యూరోపియన్ సంఘమునుండి దొరతనమువారి ఉద్యోగులగు యూరోపియన్ సంఘము వారియెడకుఁ దిరుగవలసివచ్చెను కాని దురదృష్టవశమున నాకట్టియుద్యోగిలభించుట కష్టతర మయ్యెను ఎంత ఆర్ద్రహృదయము గలవారయినను, ఎంత కాంగ్రెసు వృద్ధి కోరుచున్నను, బహిరంగముగా మాతోఁజేరి పనిచేయుటకు ఉద్యోగనిబంధనలు బాధకములుగా నుండెను కాని ఉద్యోగమునుండి విడిపోయినవారికిట్టి ప్రతిబంధకము లేకపోవుటచే రాజకీయ విషయములలో తమ యభిప్రాయ

మునను ఇచ్చుటకు వారు సామర్థ్యులై యుండిరి కావున 15 సంవత్సరముల పరిమితిగల ఉద్యోగ సమయములో నీదేశపు అభీష్టములను గూర్చి గాఢమగు సానుభూతి నెవఁడు చూపెనో, ఇండియాబ్రిటనమువారు సదయహృదయముతో పరిపాలించుచున్నను దేశీయులవృద్ధికి కావలసిన దంతియే కాక ఇప్పటి యవస్థకు సహాయకరములగునటుల స్థాపనలను (Institutions) ఔదార్యముతో మార్పవలెనని భావించుటకు మనస్సును, చూచుటకు కన్నులును గల స్వల్ప సంఖ్యాకులగు నుద్యోగస్థులలో నెవ్వఁడొకఁడై యుండెనో అట్టి సర్ విలియం వెడ్డర్ బర్న్ గారు నేఁడు మనకు నాయకత్వమును వహించియున్నారు" అని నుడివెను

జనప్రతినిధిసభ (House of Commons) లోని కొన్ని నిబంధనల మార్పులఁగూర్చియు, హిందువుల మొఱలవిషయమున సరియైన వాదప్రతివాదములు జరుపుటకు వీలుండునటులు ఇండియాలెక్కపత్రముల (Budget) ను సభవారియెదుట శీఘ్రముగా పెట్టుటను గూర్చియుఁ గూడ నితఁడుపన్యసించెను

## ఆఱవ కాంగ్రెసు

ఈ కాంగ్రెసు రెండవతూరి కలకత్తానగరమునందు సమావేశమయ్యెను మనకథానాయకుఁడనారోగ్యస్థితియందుండుటచే కాంగ్రెసును దర్శించుటకు వీలులేకపోయెను చంద్రుఁడు లేని కాంగ్రెసు ప్రతినిధులకందఱకు కాంతిహీనముగాఁ దోఁచెనని వేఱుగ వ్రాయవలెనా? సన్మానసంఘాధ్యక్షులగు మానమోహనఘోషుగారును, సభాధిపతియగు మెహతాగారును,

తమచింతాభరములను వెలిపుచ్చిరి ఇంతకంటె మనకు వేఱుగ కలదా ? ఎవనియునికివలన జనులకు మేలుకలుగునని ప్రజలు వానిని వేయినోళ్లఁగొనియాడుచుందురో, ఎవనికష్టసుఖములు వారివిగాభావింతురో, అట్టివానిదియేగదా జన్మము? ఎంతయధికారము కలిగియున్నను, ఎంతధనమును ఆర్జించికూడఁబెట్టినను జనులకు మేలుచేసి కీర్తినార్జించనిచో వానిపుట్టుక యేవ్యర్థము కావున సన్మార్గగాములై ప్రజాహితకార్యము లొనర్చుచుండ వలెను ఇట్టి కార్యములవలని ఫలము ప్రత్యక్షముగా చూడ వలెననిన మన ఉమేశచంద్రుని జీవితమే ప్రబలదృష్టాంతము ఉమేశచంద్రుని నిట్లు కొనియాడఁజేసినది యతని యధికార ధనములుగాక యతని సౌహృదయప్రజనురాగములని ఈచరిత్రం జదివినవారలకుఁ దోఁచకుండునా ?

## ఏడవ కాంగ్రెసు

ఏడవ కాంగ్రెసు (1891) నాగపురమునందు సమావేశమయ్యెను ఈసమావేశమున ముఖ్యమైన విషయము లనేకములనుగూర్చి ఉమేశచంద్రుఁడు మాటలాడె అందు మన మభిలషించిన సంస్కరణములు పూర్తిగ సఫలమగువఱకు ప్రతివత్సరము తప్పక కాంగ్రెసు జరుగుచుండవలెననుట మొదటిది ఇండియాకు మేలుకలుగఁ జేయవలెననెడి పూర్ణేచ్ఛతో ఇంగ్లండునందలి జనప్రతినిధి సభలో సభ్యత్వము కొఱకు ప్రయత్నించి సఫలమనోరథుఁడయిన దాదాభాయి నౌరోజీగారు చేయు కృషికి తమ ఆమోదమును దెలుపుట రెండవది.

1892 వ సంవత్సరమున జరిగిన ఎనిమిదవ కాంగ్రెసునకు మన కథానాయకుఁడే అగ్రాసనాధిపతి ఇట్లితఁడు రెండవమాఱు సమ్మానింపఁబడుటవలన జనుల కీతనియందు గల నమ్మికయు, ప్రీతియు, వ్యక్తము కాఁగలవు ఇట్టిగొప్పగౌరవ మప్పటి కెవ్వరి కిని లభించియుండలేదు తరువాత సురేంద్రనాథబనర్జీ, దాదా భాయినౌరోజి, సర్ విలియం వెడ్డర్ బర్న్ గార్లకు మాత్రమే లభించినది జనులచే నిట్లు పదేపదే గౌరవింపఁబడి కీర్తికాయుఁ డైన ఉమేశచంద్రుని నెంత పొగడినను తనివిదీరదుగదా? ఇతఁడగ్రాసనాధిపతిగానిచ్చినయుపన్యాసము పెద్దదియై దేశాభి వృద్ధికరములగు అనేకవిషయములను గలిగియుండెను ఆయు పన్యాసమున 'కాంగ్రెసు జనకుఁ' డని ప్రఖ్యాతి చెందిన హ్యూంగారిని ఇతఁడు మిగుల శ్లాఘించెను

కాంగ్రెసునీరీతిగా జయప్రదము గావించినది వీరివారిప్రాబ ల్యము (Influence) గాక, శాసనాబద్ధమగు పరిపాలనఁగోర నేర్పిన ఇంగ్లీషు శాస్త్రజ్ఞులయొక్కయు, మనదేశపు సరకులను గూర్చి పలువిషయములు బోధించిన ఆంగ్లేయ వర్తకుల యొక్కయు, దూరదూర పట్టణములలోనున్న మనల నిటుల సమావేశమగునటులఁ జేసిన ఆంగ్లేయ వాస్తుశాస్త్రజ్ఞుల (Engineers) యొక్కయు, సస్యాభివృద్ధి యెటులచేయవలెనో నేర్పిన ఇంగ్లీషు కృషిశాస్త్రజ్ఞుల (Planters) యొక్కయు దీని నే బ్రిటిషు పరిపాలనాజనితశక్తుల ప్రాబల్యమేయనియు నుడివెను

ఇండియా యింగ్లండులకుఁగల సంబంధము తెగిపోకుండు టకై భరింపఁజాలని ఉపద్రవములు (Grievances) మాన్పుటకుఁ దగిన క్రియలు అధికారవర్గము వారిచే నొనర్పించుటకును, ఇంగ్లండు నందువలెనే మనమును స్వేచ్ఛాకరమగు జీవితము ననుభవించుటకు అవకాశములు కలుగఁజేయుటకును, ఇండియాలోనియు, ఇంగ్లండులోనియు, బ్రిటిషు రాజ్యాంగమువారిని యడుగుటయే కాంగ్రెసువలన మనము చేయఁగోరినది యనియు నాఉపన్యాసమునందు వచించెను

పదునొకండవ కాంగ్రెసు

తొమ్మిదవ పదియవ కాంగ్రెసులకు మన బనర్జీ వెళ్లి యుండని కారణమున వానినిగుఱించి వివరించవలసిన విశేషము లేమియులేవు కాని 1895-వ సంవత్సరమున పూనాపట్టణమందు సమావేశమయిన పదునొకండవ కాంగ్రెసు మందిరము మఱియొకసారి ఉమేశచంద్రుని మృదుమధురధ్వనులచే ప్రతిధ్వనించుచు సభ్యుల కమితామోదసంధాయకమయ్యెను

ఒక నేరపువిచారణలో న్యాయాధిపతి పంచాయతీదారుల అభిప్రాయానుసారముగ తీర్పుచెప్పవలసిన నియమముండెను. ఇందుంకు విరుద్ధముగ తమయిష్టానుసార మభిప్రాయమియ్య పంచాయతీదార్ల నాజ్ఞాపించు నధికారము మండలన్యాయాధిపతులకు దొరతనము వారియ్యఁ దలఁచిరి కావున ఇండియాలో నిదివఱకుసనాతనమునుండి ప్రబలియున్న ఈపంచాయతీపద్ధతి చరిత్రను విశదీకరించుచు, ఇట్టియధికారము న్యాయాధిపతుల కొసఁగుట అనర్థదాయకమని కఠినవాక్కులతో ఖండించుచు,

ఇట్టి అనవసరశాసన నిర్మాణములకు కడంగినచో బ్రిటిషువారు పక్షపాతరహితులని ప్రజలయందు ప్రబలియున్ననమ్మిక నామమాత్రావశిష్టమై, తలంచుకొనిన కంప మొందింపఁజేసెడు స్థితికి మనము వత్తుమేమో అనియును, ఇట్టి అక్రమమగునది శాసనము కాకూడదనియు కాంగ్రెసు సభవారు గోరుచున్నారని మనబనర్జి మహోపన్యాసము గావించెను

## పంద్రెండవకాంగ్రెసు

కలకత్తానగరము నలంకరించిన పంద్రెండవకాంగ్రెసునందు (1896) ఉమేశచంద్రబనర్జి శ్రీయుతదాదాభాయి నౌరోజిగారియందు కాంగ్రెసువారికిగల నమ్మకమును దెలుపుచు, అతఁడు పార్లమెంటు సభ్యుఁడుగా తిరిగి నేమింపఁబడుటకు కోరెడి తీర్మానమును గూర్చి మాట్లాడెను

ఈసమయమున రాజద్రోహ నేరముక్రింద శ్రీయుత బాలగంగాధరతిలకుగారు శిక్షింపఁబడిరి అప్పుడు దొరతనమువారు అంకుశముగానుండు ఒక రాజద్రోహశాసనము చేయవలెనని తలఁచిరి దీనిగూర్చి మాటలాడుటకు కాంగ్రెసు కార్యాలోచనసభవారు ఉమేశచంద్రుని నియమించిరి

ఆరాజద్రోహశాసనమప్పుడు సవరణచేయుటకు కారణము, ఆచట్టము ఇంగ్లండు ఇండియాలలో సమానస్థితిలోనుండుటకని దొరతనమువారు నుడువుచుండిరనియు, అదియే యభిప్రాయమైనచో ఇంగ్లండులోని పరిపాలనా యంత్రమువలెనే ఇచ్చట గూడనేర్పఱిచినచో తనకెట్టి అభ్యంతరముండదనియు, ఉమేశచంద్రుఁడు వచించెను ఇంగ్లండులో రాజద్రోహ నేరములు దేశీ

యుఁడగు న్యాయాధిపతి యెదుటను, దేశీయులగు పంచాయతీ దార్ల సమక్షమునను విచారణజరిగి పంచాయతీదారులు, న్యాయాధిపతి ఏకాభిప్రాయులైననే శిక్షించుటగాని, విడుదల చేయుటగాని సంభవించునను సంగతి యందఱకు తెలిసిన విషయమేయనియు, అట్టివిచారణపద్ధతి మనకును ఒసంగినచో ఎట్టి కఠినమైన చట్టములను శాసించుచున్నను, చాలెరసుగారని * మనదేశమునకు దయచేసిన గొప్ప శాస్త్రవేత్త (Greatest law giver) యని పొగడెదననియు అనెను కాని దొరతనము వారట్లు చేయఁదలఁచుకోలేదనియు, దొరతనమువారి దయను సంపాదించుకొని ఎక్కువవేతనము కొఱకభిలషించుచుండెడి మండల న్యాయాధిపతులకు ఈచట్టమువలన రాజద్రోహనేరములు నిరంకుశముగా విచారణచేయుటకు ఎక్కువఅధికారమియ్యఁబడుచున్నదనియు, అందువలన చట్టమును సూచించినవారి యభిప్రాయము నెఱవేఱుటలేదనియు, ఇట్లు నెఱవేఱదని తెలిసియు దొరతనమువారు జనులకు విషతుల్యమైన ఈ చట్టము నొసంగుచున్నారనియు ఉమేశచంద్రబనర్జీ నొక్కివక్కాణించెను

ఈవిషయమును గూర్చియే యుపన్యసించుచు బొంబాయిలోని పత్రికాధిపతుల రాజద్రోహాభియోగములవలన దేశమెక్కువ అపాయకరమైన స్థితిలోనుండెననియు, ఇట్టియపాయస్థితినుండి తప్పించుటకు దూరదృష్టి కావలెననియు, తాము పంపిన ప్రతినిధులు బ్రిటిషునామమున కవమానకరముగను

* ఈ శాసనము అవసరమని సభలో నుపపాదించిన సభ్యుఁడు

స్వేచ్ఛాభిలాషులగువారికి తలవంపులుగను ప్రవర్తించు చుండి రనియు, ఇంగ్లండులోని బ్రిటిషుజనమునకు దెలుపవలెనని శోక సంతప్తహృదయుఁడై మాటలాడెను ఇట్లువీరరసమొలుకునట్టి తీవ్రముతోను, దయారసమొలుకునట్టి దీనత్వముతోను సభ్యుల మనములు కఱఁగునట్లు ఎప్పుడును ఉపన్యసించి యుండలేదు తానెంతో ప్రేమించిన కాంగ్రెసు సభామంటపమునం దీతఁడు ఉపన్యసించిన దిదియే కడపటిసారి

## సాంఘికాభిప్రాయములు

ఉమేశచంద్రుఁడు గొప్ప సంఘసంస్కరణాభిలాష కాని అట్టహాసముచేసి వట్టిమాటలుచెప్పక క్రియచేసిచూపువాఁడు రూపమునందేమి, మాటలయందేమి, ఇతరములగు అనేకాచారములందేమి, తుదకుచుట్టగాల్చు రీతియందేమి ఆంగ్లేయులనే యనుకరించినటుల గనుపడును ఇంగ్లీషువారితో సంబంధ బాంధవ్యములుచేసెను • తనకూఁతులకు రజస్వలానంతరవివాహములే యొనర్చెను హిందూమతమునకు విరుద్ధములగు క్రైస్తవమతసాంప్రదాయముల నీరీతినవలంబించినను ఇతఁడు హిందూమత ద్వేషికాలేదు పూర్వాచార పరాయణులగు హిందువులను పరిహసింపలేదు తాను హిందూదేశీయుఁడనియు, హిందువులందఱు తనసోదరులనియు హిందూదేశము తన మాతృదేశమనియు అతఁడెఱుఁగకపోలేదని నేను వేఱుగ వ్రాయవలెనా ? అతఁడు కాంగ్రెసు వృద్ధికై చేసిన కృషియే యాతని హృదయమును వేయినోళ్లఁజాటుచున్నది అతఁడొనర్చిన ప్రసంగములే యాతనిదేశభక్తిని తేటతెల్లము కావించుచున్నవి

సాంఘికాచారములను గూర్చి యితఁడు విచిత్రమయిన యభిప్రాయములను గలిగియుండెను సాంఘికవిషయములను గూర్చి బహిరంగచర్చ ఇతని కయిష్టము మతసంబంధమయిన చర్చలు బహిరంగముగా చర్చించుటచే జనులు రోషపరవశు లగుదురని యాతనినమ్మిక ఇందబద్ధముండునా? ప్రతిసంఘము నందును లోపములున్నవనియు ఆ లోపము లెవరివి వారె వారి యనుకూలానుసారముగా సవరించు కొనుచుండినచో ఎట్టి మత వైషమ్యములకును ఎట్టికలహములకును అవకాశము కలుగద నియు నెమ్మదికిభఁగము సంభవింపదనియు ఇతని యభిప్రాయము

మనలోఁగొందఱు తమయాఁడుబిడ్డలు మగబిడ్డలవలెనే విద్య నభ్యసించ వలెననియు, ఉద్యోగములు చేయవలయుననియు, అభిలాషను కలిగియున్నారు మరికొందఱు తమకూఁతుల కతిబాల్యవివాహములు చేయకుండుటకును బాలవితంతూద్వా హములనొనర్చుటకును ఇచ్ఛగలవారై యున్నారు పిరికిపంద లగుకొందఱు తాము మాత్రమేదియు మాట్లాడక సంస్కరణ ములు వానియంతటనవే ఒక రూపము చెందఁ జూచుచుందురు కావున సంఘసంస్కరణమను శబ్దమునకు నేకార్థముగల్పించి అందరునదేయర్థమునందు వాడుటపొసఁగదని నొక్కిచెప్పెను ఇక్కతముననే కాంగ్రెసు పురోక్రమము (Programme) నందు సంఘసంబాధములయిన విషయములు తీసివేయ బడినవనియు, జననమాదిగా రాజకీయ విషయములనే చర్చించు చున్న దనియు, ఇఁకముందు నాలాగె యుండుననియు, చెప్పెను

ఈయభిప్రాయములు నాఁడుకొందఱకు వెగటుగాఁదోఁచి నను ఇందుసత్యములేక పోలేదని మనము గ్రహింపవచ్చును ఇప్పటికెన్నిసంవత్సరములనుండియోజనుల మనముల జనించిన సంఘసంస్కరణోద్దేశమువలన నెంతమాత్రము లాభము కలిగి నటులదోఁచదు మీరుబ్రాహ్మణులు, వారుకోమట్లు, వీరు శూద్రులు అను కక్షలు యట్లుండఁగనే, ఆర్యసమాజము, బ్రాహ్మసమాజము, దివ్యజ్ఞానసమాజము, వేదాంతసమాజములు బయలుదేరి ఒకటికంటెనొకటిగొప్పయనివాదులాడుచు హిందువులలో హిందువులకుగాని, హిందూదేశవాసులగు పలుతెగల వారలకుగాని ఐకమత్యము కుదురుటకు దారిలేకపోయినది

నేఁడన్నోమతభేదములుగలహిందువులు, మహమ్మదీయులు, పారసీలు, క్రైస్తవులు, స్థలభేదములుగల ఆంధ్రులు, మహారాష్ట్రులు, బంగాలీలు, పంజాబీయులు, గుజరాతీలు మొదలగు వారును, సమానులనియు ఏకమాతృగర్భజులనియు అందుచే సోదరులనియు తెలిసికొని ఐకమత్యతావల్లికచే పెనవేయఁబడుట చూచుచున్నాము దేశముయొక్క రాజకీయ, పరిశ్రామిక స్థితిని బాగుపరచుటకు విద్యార్థులనేకులు విదేశముల కేగుచున్నారు పూర్వమునందును కొందఱు విదేశములకు వెళ్లియుండినను వారు సంఘసంస్కరణ సమాజమువారి నిశ్చయములను బట్టిగాక రాజకీయ విషయములను బట్టియే వెళ్లిరని నిశ్చయముగా చెప్పవచ్చును

ఈ రెండుమూఁడు సంవత్సరములలో నింతటి మహత్తరమయిన మార్పును కలుగఁజేసిన మంత్రరాజ మెయ్యదియో

చదువరులు గ్రహించగలరా? ఆకారణము సంఘసంస్కరణో ద్యమము గాక రాజకీయ సంబాధమగు నూతనోద్యమమని తెలిసికొందురు గాత! ఈనూతనోద్యమమునకు జననియగు 'కాంగ్రెసే' ఈమార్పులకు మూలకారణమని నమ్మెడు శ్రీ ఉమేశచంద్రుని వాక్యముల యర్థము మనకిప్పుడు బోధపడు చున్నది గదా?

## గుణవర్ణన

ఉమేశచంద్రుని మనస్సెప్పుడును, శాంతము, దయ, సత్యము అను సుగుణపుంజముల కాకరము దేశాభిమానమునకు పుట్టి నిల్లు. విషయగ్రహణమునకునిధి దేశభక్తి, సత్కార్యాచర ణాసక్తి, మొక్కవోవని నీతిధైర్యము, రాజకీయవ్యావహారిక జ్ఞానము, శాస్త్రవిజ్ఞానము, మొదలగునవి ఉగ్గుపాలతోనె అతని కలవడినవి అతఁడుముఖప్రీతిగా మాటలాడువాఁడుకాఁడు. అంతరాత్మబోధించు నిజమునే వక్కాణించును శాసననిర్మాణ సభలయందలి వాదములును, ఇంగ్లండునందలి యుపన్యాసము లును నిందుకుతార్కాణములు జననమాదిగా తాను ఇండియా నుండి వెళ్లువఱకును కాంగ్రెసుకుగూర్చి చేసినకృషియే నీతని పట్టుదలకు దృష్టాంతము

ఇతని హృదయమెల్లప్పుడును అసూయారహితమైయుండె డిది అధికారులెంతనిరాదరించినను లెక్కసేయని ధైర్యశాలి. స్వదేశీయులెంత గౌరవించినను దర్పోపేతుఁడుగాని నిగర్వ చూడామణి

తనకు మేలుచేసిన వారినెన్నటికిని మరచువాఁడుకాఁడు ఇందు కొక చిన్నకథగలదు ఉమేశచంద్రుని పోషకులలో ముఖ్యులు మహారాజా కమలకృష్ణబహద్దూరు అను నొక జమీందారు బనర్జీతనజీవితాంతమువఱకు ఈ గొప్పవానికి కృతజ్ఞతఁజూపుచు గౌరవించుచుండెడివాఁడు ఈ జమీందారు వద్దికి వెళ్లినపుడెల్ల పాదరక్షలులేకుండ నుండి నయభయము లతో వర్తించెడివాఁడు అతని జ్ఞాపకార్థము తనజ్యేష్ఠకొమా రునికి కమలకృష్ణ షెల్లిబనర్జీయని కూడ పేరిడియుండెను

ఉమేశచంద్రునకు డబ్బు సంపాదించి రాజవైభవమనుభ వింపవలెనను అభిలాషయుండెనఁట ఈకోరిక కొద్దికాలములోనే ఫలించి దానుగోరిన దానికన్న యాదాయము ద్విగుణ మయ్యెను ఇట్టిద్రవ్యార్జనకు కారణము అతఁడు దుర్వ్యాపారి గాక, సత్యపథగామియై, జనులస్తోత్రపాత్రుఁడగుటయే యని ఈ చరిత్రఁ జదివినవారికిఁ దెలియఁగలదు న్యాయాధిపతి పదవి దొరతనము వారియ్యఁదలఁచినను నిరాకరించుట, ఇతనికి ప్రజా సేవయందెంత యనురాగముగలదో వెల్లడికాగలదు

## ఇంగ్లండులో నివాసము

1888-వ సంవత్సరములో ఉమేశచంద్రబనర్జీ ఆరోగ్యము కొఱకు ఇంగ్లాండుదేశమునకు వెళ్లియుండెను కాని యక్కడ తనకాలమును దుర్వినియోగము చేసియుండలేదు ఆ కాల మందు ఇండియావిషయమై ఇంగ్లండులోనివారి కేమియుఁదెలి యక ఇండియాయనిన మిగుల నిర్లక్ష్యభావము కోఁజూచు చుండిరి ఇండియా దేశమున కేతెంచు నాంగ్లేయప్రతినిధు లెటుల

పరిపాలించు చున్నదియు, జనులమనోభావము లెటులుండు నదియు వారికిబొత్తిగా తెలియకుండెను ఇంతయేల ఇండియా బజెట్ (ఆదాయవ్యయగణన పత్రము) ఉపన్యాసము చదువు చుండినప్పుడు సభయందు ఒకరిద్దఱుదప్ప ఎవరు లేకుండురఁట వారును ధూమపానము చేయు గదిలోనికి వెళ్లఁగా ఇండియా మంత్రిగారు వట్టిబల్లలకే యుపన్యసించ వలసివచ్చునఁట! ఈవిచిత్రము మనబనర్జీయే ప్రత్యక్షముగా చూచి వివరించి యున్నాఁడు

ఉమేశచంద్రుఁడు ఇండియా పరిపాలింపఁబడవలసిన విధమునుగూర్చియు, ఇండియాకు నర్పించవలసిన బ్రిటిషువారి విధాయకకృత్యమును గూర్చియు, దేశమునం దనేక భాగము లందనేక పర్యాయములు ఉపన్యసించెను ఉపన్యసించుటయే గాక గొప్పగొప్పవారిని సందర్శించి వారికి హిందువుల బాధకములను, ఆదర్శములను నివేదించెను. స్పష్టముగను, సంక్షేపముగను, సూటగను, స్వభూషణాభిప్రాయరహితముగను ఉండి వినువారి నాకర్షించు బనర్జీ వాక్పాటవమునుజూచి హిందువులనాగరికులని తలంచిన ఆంగ్లేయులు సహా బాపురే! యని నిద్రమేల్కొనిరి నాఁటినుండియే ఆంగ్లేయులిండియాకు సంబంధించిన రాజకీయవిషయములఁ దెలిసికొనుటకు శ్రద్ధవహించి పనిసేయఁ గడ గిరి

**1870**-వ సంవత్సరమున హిందూదేశీయుల భాగ్యదోషంబున సర్ జేమ్సు ఫిట్సుజేమ్సు స్టిఫెన్ అనువారు సామ్రాజ్య శాసననిర్మాణ సభ 'లా' మెంబరుగా నింగ్లండునుండి వచ్చి

మున్ముందు 'దండనీతి క్రమస్మృతి' (Criminal Procedure Code) యందు గొప్పమార్పునుచేసిరి ఈమార్పువలన క్రిఁదికోర్టు యందు పంచాయతీదారుల సాహాయ్యమున మండలన్యాయాధిపతి నిర్ణయించిన శిక్షను విజ్ఞాపనమీఁద ఉన్నతన్యాయ సభవారెక్కున చేయునధికారము వారికిగలిగెను

ఇండియాలోని ప్రజలు ధర్మశాస్త్ర బద్ధులనియు, అట్లుండినను, నాగరిక ప్రదేశములందెచ్చటను లేని కఠినతమమైన పద్ధతిని వీరిపైమోపుటకు స్టిఫెన్‌గారు పూనుకొనిరనియు, దానివలన నక్రమమునకు అవకాశ మబ్బుచుండెననియు, అట్టి యక్రమపద్ధతి వలదోయని జనులెంత మొఱపెట్టుచున్నను ఆలకించువారు లేకుండిరనియు, ఆశాసనము నాచరణలోనికిఁ దెచ్చినపుడు జనులభీతిని వర్ణించుటకు వీలులేకపోయెననియు, ఐర్లండులో నిట్టిపద్ధతినే న్యాయాధిపతు లవలంబించినప్పుడు 'బాల్ఫరు * గారు అప్పీలుమీఁద శిక్షలనెక్కువ చేయవద్దని' వారికి దెలిపియచ్చటి కల్లోలము నాపివేసిరనియు ఇండియాయం దట్లు ప్రతిదినము జరుగుచుండినను ప్రశ్నించువారు లేరనియు, ప్రజలమొఱ యరణ్యరోదనమనియు, ఉమేశచంద్రుఁడు సోదాహరణముగా నింగ్లీషువారికి తెలిపెను

శాసననిర్మాణసభలలో మనవారు సరియైనప్రాతినిధ్యమును బొందుటలేదనియు, రాజప్రతినిధిగారి వ్రేలి కదలికచే వారి యభిప్రాయమును గనుఁగొని దానిప్రకారము 'అవును' 'కాదు' అను ప్రత్యుత్తరములనిచ్చునిరక్షరకుక్షులతో నిండి

* ఇంగ్లండు నందు మంత్రి

యుంౘెననియు, ఏమెంబరు తలయూపు చూడవలసినదే కాని స్వతంత్రించి మాటలాడుటకు వీలులేదనియు స్వతంత్రించి యభిప్రాయముఁదెలిపినచో వాఁడు రాజద్రోహియనియు, అరాజకుఁడనియు వర్ణించఁబడి తిరిగి సభాప్రవేశమునకే ఆకరము లేకుండెననియు వివరించెను

హిందువులు ప్రాతినిధ్య పరిపాలన మెరుగరని పరిహసించు చుండిన ఆంగ్లేయులకు తెలియునటుల అనాదినుండి యనఁగా బ్రిటిషువారు నిద్రావస్థలోనున్న తఱికి పూర్వమునుండియే, హిందువులు పంచాయతీ పద్ధతుల కలిగియుండిరనియు, ఈ పరిపాలనా పద్ధతివీరికి క్రొత్తదిగాదనియు బోధించెను మన దేశీయ పితామహుఁడగు దాదాభాయి నౌరోజి మొదలగు స్నేహితుల సాహాయ్యమువలన ఇండియా రాజకీయ విషయ ములను చర్చించు నొకసంఘమును స్థాపించె అది నేఁటికిని నిరంతరాయముగ జరుగుచున్నది తనకార్య క్రమముల నీరీతిగా ముగించి ఆసంవత్సరము అలహాబాదులో జరుగనుండిన నాల్గవ దేశీయ మహాసభను సందర్శించుటకై స్వదేశమునకునుఅలెను

ఈవిధముగా 1888-వ సంవత్సరము మొదలుకొని నవ రాత్రులలో (Puja festivals) ప్రతి సంవత్సరము ఇంగ్లండునకు వెళ్లి వచ్చుచుండెను అచ్చట ' క్రోయడను ' నందు ఒక గృహమునుగొనెను ఈయింటిని దర్శించి సత్కారమును బొందని ఇంగ్లండువెళ్ళిన హిందువు లరుదు

ఉమేశచంద్రుఁడు తనపిల్లల నచటనేయుంచి విద్యఁగరపిం చెను తుదకు 1902 వ సంవత్సరమున హిందూదేశమును

వదిలిపెట్టి ఇంగ్లండులోనె నివాసమేర్పఱుచుకొనెను. అచ్చట ప్రవేశించిన కొద్దికాలములోనే ప్రివికౌన్సిలునందు న్యాయ వాది వృత్తిఁబూని ద్రవ్యము గడింపసాగెను. హిందూదేశీయ మహాసభయొక్క బ్రిటిషుసంఘమునకు తనయొక్క కాలము నంతయు విని యోగించుచుండెను. తనమాతృదేశమునకు మేలు చేయవచ్చునని పార్లమెంటు సభ్యత్వమునకు ప్రయత్నించు చుండెను. ఇట్లు వాల్థాంప్స్టో (Walthompstow) ప్రాతినిధ్యము కొఱకు పాటుపడునప్పుడే ఇండియనుల దురదృష్టవశమున నాతనికంటకి జబ్బుచేసి దానివలన ఆరోగ్యము చెడి మిక్కిలి నీరసస్థితికివచ్చెను. మరణకాల మాసన్నమైనదని తెలిసి కొన్నవాఁడై తనరోగమిఁక కుదురదనియు, తనకు కాలము సమీపించెనదనియు, బరోడాలోనున్న రమేశచంద్రదత్తునకు వ్రాసెను. తుదకటులనే జరిగెను. 1906వ సంవత్సరము జూలై నెల 21-వ తేదిని సద్గుణనిధానమగు దేశభక్తబాబు ఉమేశ చంద్రబనర్జీని 63-వ ఏఁట పరమేశ్వరుఁడు తన సామీప్యము నకు చేర్చుకొనెను. ఈ సమాచారమప్పుడే హిందూదేశమం దందఱు విని బిట్టువగచిరి.

హిందూమాత తన పుత్రరత్నమును గోల్పోయెను. విద్యార్థికులు తమ ప్రియసోదరు నెడఁబాసిరి. హిందూదేశీయ మహాసభ తనజనకవర్యుని పోఁగొట్టుకొనియె. ప్రజలు తమ

నాయకుని గోఖ్లేయిరి దాదాభాయినౌరోజి, గోపాలకృష్ణ గోఖలే మొదలగు ప్రముఖులు తమ సంతాపములను వెలి పుచ్చుచు సభఁ జరిపిరి

## సమాప్తి

ఉమేశచంద్రుని జివితము తిలకించినకొలఁది కాంగ్రెసుమూల కముగ నతఁడు దేశాభివృద్ధికెట్లు పాటుపడినది చదువరులకు గోచరమయి యుండును కాంగ్రెసు ఆకారమును దృఢ పఱచెడి విషయోపసంఘము (Subject Committee) నందు ఉమేశచంద్రుఁడెట్లు వివాదాంశములఁ గుదురు పఱచినదియు, ఆతనిమాటలయం దాసంఘము వారికెంత యాదరముండి నదియు, ఆసంఘమును సందర్శించినవారికి మాత్రమె తెలియును శక్తిసామర్థ్యములఁ జూపుటకు ఉమేశచంద్రుని కిండియా చాలలేదనియు, ఇంగ్లండు అమెరికావంటి దేశములందయిన యెడల నీ మహానుభావుఁడు ప్రధానమంత్రియో, రాష్ట్రాధి పతియో అయి యుండుననియు గొప్పవార లభిప్రాయపడిరి

ఇట్టి యీ మహాపురుషుని జీవిత చరిత్రమేరి కాహ్లాద కరము కాకుండును? చదువరులెల్లరును ఇతనిదేశభక్తిని, స్వార్థ త్యాగమును, తామును అలవడఁ జేసికొనఁ బ్రయత్నించినచో మనకు శుభం బచిరకాలంబుననె కాకుండునె?

# రమేశచంద్రదత్తు.

## జన్మభూమి

ఖండంబులందు ఆసియాఖండము గొప్పది అందలి దేశంబులందు భారతవర్షము ప్రఖ్యాతము అందు ఆర్యావర్తము సనాతనము, నాగరికాగ్రగణ్యము, ప్రసిద్ధపట్టణ రాజములకు నిలయము, పర్వతరాజపంక్తికి జగత్ప్రసిద్ధము, అవతారపురుషులనందగు రామ, కృష్ణ, బుద్ధాదులకు విహారారామంబు ఈ ఆర్యావర్తమునకు వంగరాష్ట్రము కొలికపూస భయంకరాచారమగు 'సహగమనమును మూలచ్ఛేదముగావించుటయే గాక, సకలశాస్త్రవిదుఁడై, సకలభాషావిశారదుఁడై ఏకేశ్వరోపాసనంబునుబోధించు బ్రాహ్మసమాజమును నెలకొల్పిన గొప్ప సంఘసంస్కర్తయగు, రాజా రామమోహనరాయలకిదియే జన్మభూమి మహాయోగియు, సకలమతసార బోధకుఁడును అగు రామకృష్ణపరమహంస కిదియే పుట్టినిల్లు బాల్యముననే తురీయాశ్రమము చేకొని, ఖండ ఖండాంతరంబులకేగి హిందువుల ఉపనిషత్సారంబును వారికి బోధించి, అంత వివేకులైన వారల శిష్యులుగా గ్రహించిన మానవాగ్రణియు, మహావక్తయు అగు వివేకానంద స్వాములవారికిదియె బాల్యమునందు సంచారభూమి చైతన్యనిభక్తిరసము ప్రవహించిన దిచ్చటనె విద్యాసాగరుని యపారపాండిత్యపటిమ వికసించిన దీప్రదేశము

నందె ఉమేశచంద్రబనర్జి, ఆనందమోహనవసు, లాలుమోహనఘోషు మున్నగు రాజకీయ, సాంఘిక శాస్త్రకోవిదుల ముద్దుమాటల నలరిన దీరాష్ట్రమే ఇట్టి మహాపురుషులకు స్థానమై వెలసిన ఈప్రదేశమునందే శ్రీరమేశచంద్రదత్త మహాశయుఁడు జన్మించెను సింహము కడుపున సింహంబే పుట్టుచుండునుగదా!

## వంశము

రమేశచంద్రదత్తు పండిత సాంప్రదాయములోని వాఁడు ఇతనితాతముత్తాతలు విశాలహృదయము చేతను, కారుణ్యాధిక్యతచేతను ప్రసిద్ధికెక్కి యుండిరి ఇతని పెదతండ్రియగు రాసుమాయి దత్తుగారు మొదట కలకత్తాలోని సంస్కృత కళాశాల ప్రథమోపాధ్యాయుఁడుగాను తదుపరి స్మాలుకాజు కోర్టులో న్యాయాధిపతిగను ఉండి గొప్పపదవులఁ బొందిన హైందవులలో ప్రథములు ఇతనితండ్రియగు ఈశానచంద్రుఁడు లార్డుబెంటిక్కుగారి ప్రభుత్వములో సహాయకరగ్రాహి (డిప్టీకలెక్టరు)గా నుండెను ఇతనికి రక్తసంబంధినియగు శ్రీమతి తోరూదత్తుచే రచింపఁబడిన ఇంగ్లీషు గీతములను ఇంగ్లీషువారు మిక్కిలి యాదరణతో చదువుచుండెదరు వీరలెగాక వీరి వంశమునందనేకులు సాహిత్యము నందు ప్రవీణులై యున్నారు.

## బాల్యము

రమేశచంద్రదత్తు కలకత్తానగరము నందు 1848-వ సంవత్సరము ఆగస్టు 13-వ తేది జన్మించెను ఇతనితండ్రి డిప్టీకలెక్టరుగానుండి వంగదేశములోని జిల్లాలయందు తిరుగుచుండుట

చేత రమేశచంద్రుని బాల్యమంతయు ఆగ్రామమునం దే గడ చెను ఆకాలమునందు ఇనుపదారులు లేవుని జనులు ఎడ్లబండ్ల మీఁద ప్రయాణము చేయుచుండిరి దత్తో[illegible] యీ [illegible]ములన్నియు జ్ఞాపకముండెను ఆంగ్లేయవర్తక సంఘమువారి పరిపాలనయు డాల్ హౌసిపెళ్లుటయు, క్యానింగు ప్రభు[illegible]టయు, అతనికిఁ దెలిసియుండెను సిపాయికలహము అడఁగిన తరువాత మహారాణి విక్టోరియాగారు ఇండియాపరిపాలన స్వీకరించి దయచేసిన ప్రకటన వినుపించుటకు సమకూడిన పబ్నాజిల్లాలోని గొప్ప మహాసభకు తమ తండ్రిగారితో మ రమేశ చంద్రుఁడు వెళ్లియుండెను తల్లియు దండ్రియు [illegible] చిన్నతనము నందె కాలధర్మము నొందిరి కావున రమేశచంద్రుఁడును అతని సోదరులు సోదరీమణులును, పినతండ్రియగు శశి చంద్రుని పోషణలో నుండుచు వచ్చిరి రమేశుఁడు ఇంగ్లీషు విద్యనేర్చుట కారంభించి 1864-వ సంవత్సరమునందు జరిగిన సర్వకళాశాల ప్రవేశ పరీక్షయందు మొదటివాఁడుగా కడతేరెను 1866-వ సంవత్సరమున జరిగిన ప్రథమశాస్త్ర పరీక్షయందు ద్వితీయుఁడుగా కృతార్థుఁడయ్యెను పట్టపరీక్షయందు కృతార్థుఁడుగా నేలేదు ఈవిషయమే యితనిభవిష్యత్తును మార్చివేసెను

## ఇంగ్లండునకు వెళ్లుట

1868-వ సంవత్సరము మార్చి 3-వ తేదిన [illegible] బంగాలీ యువకులు స్వదేశమును విడిచి నావమీఁద ఇంగ్లండునకు వెళ్లిరి వారిలో సురేంద్రనాథ బనర్జీగారొకరు వీరు తమ

తండ్రియనుజ్ఞను బొందియే బయలుదేరిరి బిహారిలాల్ గుప్త, మన రమేశచంద్రదత్తు తక్కినవారలు వీరిద్దఱు మాత్రము తమ తల్లిదండ్రులకుగాని బంధుగులకుగాని చెప్పక ఒక రాత్రి వేళ పయనమైరి ఓడనెక్కు సమయమందు తమ రెవరయినది తెలిసికొని అడ్డగించుదురేమో యని టక్కెట్లు సురేంద్ర నాథుని పేర నేకొని "ఇంగ్లండునకు వెళ్లువారలు సురేంద్ర నాథ బనర్జియు, మఱియిద్దఱు స్నేహితులు" అని వ్రాయించిరి ఆకాలమందు సంఘసంస్కార మంతగా ప్రచారమందుండక పోవుటచేత సముద్రయానము ఎక్కువసంఖ్యగల పూర్వాచ్చార పరాయణులు నిషేధించి పోయివచ్చినవారిని బాధించుచుండిరి ఇట్టి స్థితిలో నీ బాలకత్రయము పూనిన సాహసకార్యమునకు మనము వారి నెంతయు గొనియాడ వలసియున్నది

సురేంద్రనాథబనర్జి నామమెఱుంగనివారు హిందూదేశము నందరుదు ఈ మహనీయుఁడు దేశాభిమానియనియు, మహావక్తయనియు, రాజనీతికోవిదుఁడనియు పొగడ్తకెక్కి తన జీవితధర్మమును చక్కగా నెఱవేర్చుచున్నాఁడు నెఱవేర్చుచున్నాఁడు బిహారిలాలు గుప్తా గారు కలకత్తా ఉన్నతి న్యాయ సభలో న్యాయాధిపతి యంతటి గొప్ప పదవినిబొంది దొరతనమువారిచే ననేక సన్మానములను బడసి ఇప్పుడు నౌకరిమానుకొని ఉపకారవేతనమును బొందుచున్నారు రమేశచంద్రుఁడు గూడ గొప్పపదవులస్వీకరించి, ఉపకారవేతనమును బొందినను, తదుపరి యనేక వివిధవిషయములను గూర్చి కృషిచేసినందున ఇతనికీర్తి జగద్విశ్రాంతి నొందెను ఆహా! దొంగతనముగా

వెళ్లిన బాలురే యిట్లు గొప్పవారలై మహోన్నత పదవుల నంది ప్రజానాయకు లగుదురని నాఁడెవ్వరు దలఁచిరి? సముద్ర యాన నిషేధములేకున్న యిట్టి ప్రజానాయకు లెంతమంది పుట్టియుందురో గదా?

1869-వ సంవత్సరమున జరిగిన సివిల్ సర్వీసు పోటీపరీక్ష యందున ముగ్గురును జయించిరి. ఆపరీక్షయందు 300 కన్న నెక్కువ పరీక్షార్థులుండిరి. కాని దత్తు మొదట మూఁడవ వాఁడుగ కడతేరెను, ఇంగ్లీషు వాఙ్మయమున ద్వితీయుఁడుగా నుండెను. సంస్కృతమునందు ఉలభముగా ప్రధముఁడయ్యెను.

ఈహైందవ విద్యార్థులు అచ్చటి గొప్పవారల ననేకుల సందర్శించి వారిచేమున్ననలఁ గొందిరి. 1868-వ సంవత్సరములో జరిగిన జనప్రతినిధి సభ ఎన్నిక గడబడలో రమేశచంద్రుఁ డచ్చటనే యుండెను. ఈ ఎన్నికలో స్వాతంత్ర్యవాదులు (లిబరల్సు) ప్రభుత్వమునకు వచ్చిరి. గ్లాడుస్టన్ మహాశయుఁడు మొదటిసారి మంత్రియయ్యెను. రమేశచంద్రుఁడు జనప్రతినిధి సభ చూచుటకువెళ్లి గ్లాడ్‌స్టన్, డిస్‌రేలి ప్రముఖుల ఉపన్యాసములను శ్రద్ధగావినెను. ఆకాలమునందు ఇండియా దేశమునకై పాటుపడుచుండెడు జాన్ బ్రైట్, హెన్రిఫాసెట్ అనువారల స్వయముగాచూచి మాటాడెను. స్వాతంత్ర్యదర్శనకర్తయగు జాన్ స్టూఆర్టుమిల్లుయొక్కయు, చారెసుడికెన్సు యొక్కయు ఉపన్యాసముల వినుటకై ఆయా సభల కితఁడు వెళ్లెను. ఇటుల అచ్చటి ప్రసిద్ధపురుషులస్నేహము సంపాదించి సంతసముతో స్వదేశమునకు మరలెను.

## విదేశములందు గ్రుమ్మరుట

స్కాట్లండు ఐర్లండు దేశములయందు సంచారముచేసి తన పరీక్షలన్నియు ముగియగానే రమేశచంద్రదత్తు తనమిత్ర ద్వయముతో ఇంగ్లండునువదలి, ఫ్రాన్సు, జర్మని, స్విట్జర్లాండు ఇటలీల గుండవచ్చిరి ఇచ్చట వివరింపదగిన యొక విశేషము ఫ్రాన్సునందు జరిగెను అచ్చట 1870-71-వ సంవత్సరములయందు సంభవించిన యుద్ధము వీరువెళ్లినప్పుడే యంత్యమయ్యెను 1871-వ సంవత్సరము ఆగస్టునెలలో వీరు ప్యారిసునగరమునకు వెళ్లియుండిరి అరాజకులు అచ్చటి సుందరసౌధములను నాశనముచేసియుండిరి ఫ్రెంచిదొరతనము వారుమిగుల కోపోద్రేకులైయుండిరి అరాజకులని సంశయము కలిగినంతమాత్రమున ప్రతివానిని ఫ్రెంచిభటులు తుపాకికాహుతిఁ బడవైచుచుండిరి మనబంగాళీ పిన్నవాండ్రనుగూడ అరాజకులనుగా భావించి వారలఁబట్టుకొని ఫ్రెంచి కారాగృహములో ఒకరాత్రి పడవేసియుంచిరి మఱునాఁడుదయమున విచారణార్థమువారు వీరలఁ దేగా, వారుతమవద్దనున్న ప్రయాణాధికారపత్రికను (పాసుపోర్టు) జూపి తాము బ్రిటిషుపౌరులమని స్థాపించుకొనిరి అప్పటికి ఆయుద్యోగుల మొదటి కోపోద్రేకము కొంచెము తగ్గియున్నందున వీరుచెప్పినదంతయు వినునట్టి స్థితిలో నుండిరి వీరల ప్రశ్నించిన యుద్యోగి తృప్తిఁబొందినందున తుపాకిదెబ్బకు గురికాకుండ వీరు తప్పించుకొనఁగలిగిరి ఒక వారము ముందుగా వీరలఁబట్టుకొని యుండిన యెడల నీకథ మఱియొక విధముగా పరిణమించి యుండును! భారతమాత

ధైర్యశాలులగు తన కుమారత్రయమును గూర్చి 'మియు విన కుండఁబోయియుండును!

## ఉద్యోగధర్మనిర్వహణము

దేశీయులు గొప్ప అధికారముల వహించతగినవారు కారని యభిప్రాయము లు ప్రబలుచుండెడికాలమున గమేశచంద్రుఁడు ఉద్యోగమునందు ప్రవేశించెను ఈతనివలననే దొరతనము వారు పూర్వోక్తాభిప్రాయము లు మార్చుకొని, ఈతనకే గొప్ప పదవినికూడ నిచ్చిరి ఈతని ఉద్యోగధర్మ నిర్వాహణకాలమును మూఁడు విధములుగా విభజింపవచ్చును

### ప్రథమదినములు 187.—1882

ఈపదునొకండు సంవత్సరములలో బంగళా రాజధాని యం దలి వివిధమండలములయందు వివిధపదవులయందుండి ఇతఁడు పనిచేసెను 1874-వ సంవత్సరమున నదియా మండలమందు సంభవించిన కాటకనివారణోద్యమమునందు నియోగింపఁ బడెను కాని 1876-వ సంవత్సరములో నింతకన్న కష్టతరమగు కార్యభారమును వహింపవలసివచ్చెను అప్పుడు భయంకర మగు ఉప్పెనతుపానులచే తూర్పుబంగాళాయంతయు జలప్రళ యముచే ముంచివేయఁబడెను వేనవేలుజనులు మరణ మొందిరి ఇట్టిస్థితిలో గంగాముఖమందలి దక్షిణ షాహా బాజు పూరు జిల్లా అను ద్వీపమందు పరిపాలనను కుదురుపఱుచు టకై రమేశచంద్రుఁడు నియమింపఁబడెను. యుద్ధరంగమువలె ఆద్వీపమంతయు కళేబరములతో నిండియుండెను, పురుషుల యొక్కయు స్త్రీలయొక్కయు శవములు చెట్లకొమ్మలకు

వ్రేలాడుచుండెను, చెరువులలో తేలుచుండెను, నదీతరంగములచే క్రిందికి మీఁదికి కొట్టుకొని పోవుచుండెను గోరుచుట్టు మీఁది రోకటిపోటు చందంబున ఈ అవస్థలోనే నింతకంటె యనర్థదాయకమగు ‘కలరా’ దేవత ప్రత్యక్షమయ్యెను నీళ్లలో కొట్టుకొని పోవునట్టియు, కొట్టుకొనిపోఁగా నిండ్లయందు మిగిలినట్టియు, సామానులను తస్కరులు ముచ్చిలించుచుండుట ప్రతిదిన చర్యగానుండెను పైర్లుపాడగుటచే దుర్భిక్ష మహాదేవికూడ నవతరించి సర్వనాశకథ సంపూర్తిగావించెను ఇట్టి భయంకరమగు విపత్పరంపరలలో నయిదు సంవత్సరములు మాత్రమే యనుభవముగల మనకథానాయకుఁడు ఒక్కఁడే పనిచేసెను, గ్రామములను తిరిగికట్టించెను, సరియైనపద్ధతి నెలకొల్పెను, దురదృష్టుల దుఃఖవిమోచనము గావించెను, పరిపాలనను క్రమపఱచెను రమేశచంద్రుఁడు జిల్లావదలకమునుపే అది శాంతాభ్యుదయములకు నిలయమై మరియొకసారి కలకలలాడుచుండెను

## మండలదండవిధాయక పదవి

### 1882–1892

ఉద్యోగమునందు ప్రవేశించిన మొదటి పదునొకండు సంవత్సరములలో రమేశచంద్రుఁడు మండల దండ విధాయకుఁడుగా (జిల్లా మేజిస్ట్రేటు) అప్పుడప్పుడు కొద్దికాలము పనిచేసెను ఇట్టి గౌరవము ఇతరబంగాళీ ఉద్యోగులకును లభించియుండెను కాని చాలకాలము హిందువులను మండలాధిపతులనుగా నియోగించుట క్షేమమా? హిందూ ఉద్యోగస్థులకు స్థిర

ముగా మండలదండవిధాయక పదవి నొసంగుటసరియా? అని ఆంగ్లేయ పరిపాలకులు విచారింపనాగిరి ఆంగ్లేయహైందవ పత్రికలీ యంశములను విని పరిహాసించెను కాని దొరతనము వారీసమస్యను ఒకసారి ప్రయోగపూర్వకముగ చూడఁబూను కొనిరి అలాగుననే రమేశచంద్రుఁగు మండలకార్యనిర్వాహకోద్యోగమునకు స్థిరముగా నియమింపఁబడెను హిందువులలో నిట్టి యున్నతోద్యోగము బొందినవారలలో మనగత్తుగారే ప్రథములు 1883-వ సంవత్సరము ఏప్రిల్ నెల మొదలుకొని 1885-వ సంవత్సరము ఏప్రిల్ వఱకు బంగాళా రాజధాని యందు అల్లరులవలన పరిపాలనకుఁ గష్టతమమగు బారిసాల్ (బ్యాకరుగంజు) మండలమునకు అధికారిగనియమింపఁబడెను ఆసమయమందు 'ఇల్బర్టుబిల్లు' వివాదము మూలమున జాతి విద్వేషములు ఎక్కువగా ప్రబలియుండెను కాని ఈ ప్రయోగము బహు జయప్రదముగ పర్యవసించెను తనక్రింది యుద్యోగస్థులగు సంయుక్తదండవిధాయకుఁడు (జాయంటు మేజస్ట్రేటు) ఉపదండవిధాయకుఁలు, (సబుమేజిస్ట్రేటు) మండలవైద్యాధికారి (జిల్లా సివిలుసర్జన్), ఆరక్షకభటాధ్యక్షుఁడు (పోలీసు సూపరింటెండెంటు) మున్నగునాంగ్లేయులతోనీ హైందవదండ విధాయకుఁడు ఐకమత్యముతో పనిచేసెను శాంతము నెల కొల్పెను గడచిన సంవత్సరములందున కంటె నీతనికాలమందు నీసంక్షోభకరమగు జిల్లాలో తిరుగుబాటు, అల్లరికేసులు మిక్కిలి తక్కువయయ్యెను జనబాహుళ్యముయొక్క ప్రేమకును గౌరవమునకు నితఁడు పాత్రుఁడయ్యెను దొరతనము

వారి గెజట్టులో ప్రచురింపఁబడిన సాంవత్సరిక తీర్మానములు స్తోత్రపారములలో నిండి రమేశచంద్రుని పరిపాలనా ఫలితము లను వేనోళ్లఁ జాటుచుండెను.

రిప్పన్ ప్రభువప్పుడు రాజప్రతినిధిగానుండెను. అతఁడు రమేశచంద్రుని ప్రజ్ఞాసామర్థ్యముల కచ్చెరు వందినవాఁడై యాతని పిలిపించి యిటులమాటాడెను "నేనుహిందూదేశ మును విడలుటకుముందు నిన్నుఁజూచి, పరిచయము కలుగఁజేసి కొనవలయునని కుతూహలము జనించినందున పిలిపించినాను ఇంగ్లండు నందు నీవొనర్చినకార్యములు తెలిసి పరిపాలన యందలి గొప్ప పదవులకు ఇండియనులు తగరని ప్రశ్నించుట కెయ్యవకాశమును ఉండదు" ఇటుల 1885-వ సంవత్సరము నుండి మండలాధి కారమును వహించుటకు హిందువులు తగుదురా తగరాయని ప్రశ్నించవలసిన యగత్యము లేకపోయినదని నుడువుటకు ఎంతయు సంతసముగా నున్నది

1885 వ సంవత్సరములో రమేశచంద్రుఁడు రెండు సంవ త్సరములవఱకు ఫర్లో సెలవు తీసికొనెను ఈ రెండుసంవత్సర ముల కాలములో కొంతకాలము విద్యాపరిశ్రమయు, మఱి కొంతకాలము దేశసంచారమును చేసెను వీనినిగురించి మరి యొకచోట వ్రాసెదను

సెలవు ముగిసిన తరువాత రమేశచంద్రుఁడు పనిలో ప్రవే శించెను మొట్టమొదట తన బాల్యమునంతను గడపిన పబ్నా జిల్లాకును, తదుపరి, బంగాళాయందు భారతమమండలమగు మైమెన్‌సింగునకును మార్చఁబడెను ఇది 40 లక్షల జనసంఖ్య

గలిగి ఎక్కువ పరిమితిగల జిల్లా అయియుండెను, అదినటికు కరగ్రాహి (కలెక్టరు) గానున్న ఆంగ్లేయుని కృత్యములవలన హిందూమహమ్మదీయులకు ద్వేషముజనించెను కాని రమేశ చంద్రుఁడు వెళ్లిన కొలఁదిదినములలోనే గండిపూడ్వఁబడి ఐకమత్యము నెలకొల్పఁబడెను

ఈ జిల్లాయందు మన కథానాయకుఁడు రెండున్నర సంవత్సరములు పనిచేసియుండెను. కార్యనిర్వహణయందును, జనులలో అభ్యుదయాభివృద్ధి కలుగఁజేయుటయందును, రాదారిబాటలను, వార్తావాహకములను (పోస్టాఫీసులు) నిర్మించి వృద్ధిచేయుటయందును ఈతని పరిపాలనకాలము వన్నెకెక్కియుండెను దయార్ద్రహృదయముగల నీతని యుపదేశము ప్రకారము మండలసంఘములును (జిల్లాబోర్డులు) తాలూకా సంఘములును (తాలూకా బోర్డులు) తృప్తికరముగా పనిచేయుచుండెను. ఇట్లు ఒక్కనిమిషమైన తీరికలేకుండా పెద్ద జిల్లాలో ఉద్యోగమును నిర్వహించుచున్న నితఁడు ఈతని జీవితకాలములో వ్రాయఁబడిన వానిలో గొప్పగ్రంథమగు 'పూర్వహిందూదేశమందు నాగరికత' యను దాని నిప్పుడే ముగించెనన్న సంగతి మాచదువరులను ఆశ్చర్యమనస్కులఁ గావించును గదా?

•1890-వ సంవత్సరములో రమేశచంద్రదత్తు బరడ్వాన్ జిల్లాకు మార్పఁబడెను అప్పుడు బరడ్వాన్ మహారాజాగారు పిన్నవాఁడైయుండెను అందుచే నీమండలకరగ్రాహి (జిల్లా కలెక్టరు)యే వానివిద్యాభివృద్ధి విషయమునను సంస్థానపరిపా

లన విషయమునను పనిచేసెను బరద్వాను నుండి డినాజ్ పురమునకును, తరువాత మిధునపురమండలమునకును వెళ్లెను ఈ కష్టతరమయిన మండలమునందు సుమారు 2 సంవత్సరము లుండెను ఇట్లొకజిల్లానుండి మరియొకజిల్లాకు వెంటవెంటనె పోవలసి వచ్చినందునను, మైమనుసింగు, మిధునపురమునంటి జిల్లాలలో దుష్కరమైన కార్యములయందు నియుక్తుడై యుండుటచేతను, బరద్వాన్, దినాజిపూరు జిల్లాలలోని విషవాయువులవల్లను రమేశచంద్రుని దేహ మస్వస్థతనొందెను అంత 1892 లో నితడు 2 సంవత్సరముల సెలవు తీసికొనవలసె వచ్చెను

## డివిజనల్ కమీషనరు

### 1894_1897

ఇంతవఱకు రమేశచంద్రుడు 22 సంవత్సరములు పనిచేసి దృఢమైనవాడనియు, జ్ఞానాధిక్యుడనియు, పదవికి మిగుల తగినవాడనియు, ప్రసిద్ధిచెందియుండెను పరిపాలనావిధమును గూర్చిన యనేక విషయములయం దితని యభిప్రాయములను, తీర్పులను దొరతనమువారు ఎక్కువగ సమ్మానించిరి కృషీవలులయెడను, కూలిచేసికొను బ్రతుకువారియందును నీతనికి గల సానుభూతి వెల్లడియయ్యెను దుస్తరమైన జిల్లాలయం దెట్టి కష్టసమయములందును నీతనిపని జయప్రదముగా పరిణమించెను అందుచే " ఈతడు కమీషనరు పదవికిగూడ తగియున్నాడే " యని ఇంగ్లీషువారి హృదయములు గొట్టుకొన

సాగెను! 'కమీషనరు ఎని యీతనికీయక ఉపేక్షింతురా యని స్వదేశీయులు తమలో దా మనుకొనసాగిరి

ఎవరెట్లనుకొన్నను విషయముమాత్రము ఇండియా మంత్రి గారి సభలో ఆలోచనకు వచ్చెను భారతీయుఁడా యుద్యోగమును నిర్వహించు శక్తియుతుఁడైన యెడల నా యవకాశమును పోనియ్యఁగూడదని వా రభిప్రాయపడిరి అందువలన సమయము తటస్థించఁగనే 1894-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో బర్డ్వాన్ డివిజనుకు రమేశచంద్రుఁడు కమిషనరుగా నేమింపఁబడియెను 19-వ శతాబ్దమున భరతఖండంబున నంతటియున్నతోద్యోగమును వహించిన భారతీయుఁ డితఁ డొక్కఁడె

కమీషనరు పదవి కర్హులగు వారిలో నొక ఐరోపీయమండల కరగ్రాహి తనయుద్యోగానుభవమునుబట్టి జ్యేష్ఠుఁడుగా నుండెను కాని యతఁడంత యారోగ్యవంతుఁడు కాకపోవుటచే దొరతనము వారతఁ డద్దానిని నిర్వహింపఁజాలఁడని యభిప్రాయ పడి వాని కీయకపోయిరి కావున నతఁ డిప్పుడు రమేశచంద్రుని క్రింద పనిచేయవలసివచ్చెను ఇతఁడును, ఇతర మండలకరగ్రాహులును నిట్లు విజాతీయుఁడును పరిపాలిత ప్రజామండలిలోని వాఁడును నగు నీతని క్రింద పనిచేయవలసి వచ్చినను, ఎంతమాత్రమును సంకోచింపక ధర్మబుద్ధితో ప్రవర్తించుట శ్లాఘనీయమయిన విషయముగదా? రమేశచంద్రుఁడు మొదట బరడ్వాన్ డివిజనుకును, పిమ్మట ఓఢ్రదేశమునకును కమిషనరు అయ్యెను ఈ కాలమునం దెవ్వఁడును రమేశచంద్రునకును

క్రిందియుద్యోగులగు ఇంగ్లీషువారికిని, మనవ్యక్తులు, అంతర్వృత్తి అను నవివేకి ఐకమత్యముతో పనిచేసియుండిరని తెలుపుట కెంతయు మా సంతసముగానున్నది

ఒరిస్సా పరగణా కమీషనరుగానున్న సమయముననే రమేశచంద్రుడు శాసననిర్మాణ సభ్యుడుగా బంగాళా దొరతనమువారిచే నేర్పరుపబడెను అప్పుడు మండలములను గూర్చిన యనేకవిషయములను, ఎక్కువ యనుభవముగల మన రమేశచంద్రుని వలన తెలిసికొని అప్పటి లెప్టినెంటు గవర్నరగు సర్ చార్లెసు యిలియటు గారు తమ సంతోషము ననేకపర్యాయములు తెలిపియుండిరి కాని మిక్కిలి దూరప్రదేశమయినట్టి యాప్రదేశమున కీతడు మార్పబడినప్పుడు శాసననిర్మాణసభాసభ్యత్వమును మానుకొనవలసి వచ్చెను

ఆప్రదేశమునందు కమిషనరుగా నున్నవాడు యచ్చటి స్వదేశసంస్థానముల కార్యములు చక్కబెట్టవలసియుండెను ఈ యుద్యోగముకూడ ఒక ఇంగ్లీషు కలెక్టరుమీదనే పడవలసియుండెను కానియతడు సమర్థుడని దొరతనము వారభిప్రాయపడి యాతనికిచ్చివేసిరి

ఇట్లు కమీషనరు పదవివహించిన మనభారత పుత్త్రరత్నము పూర్వమువలెనే యీపదవియందును అత్యున్నతమైన గౌరవస్థానము నందెను 1897-వ సంవత్సర ప్రారంభమున సెలవుతీసికొనుటయే గాక అదేసంవత్సరము అక్టోబరునెలలో ౨౬-సంవత్సరములనుండి నిర్వహించుచున్న యుద్యోగమును మానుకొనెను

నియమముల ప్రకారము ఇంకను 4 సంవత్సరములు ఉద్యోగమును నిర్వహించుటకు వీలున్నను రమేశచంద్రుఁడింత తొందరగా విడిచి పెట్టుటను గూర్చిజనులు పలు విధములఁ దలపోయఁ జొచ్చిరి మాననీయమును ద్రవ్యసంపాదన కనుకూలమునైన యీయుద్యోగమును వదలుట కేవలము పారపాటని యాతని ప్రాణమిత్రులు తలంచిరి దొరతనము వారితనికి తగిన మన్ననొసంగలేదు కాబోలని జనసముదాయము తలంచెను ఈ కడపటి విషయమునకేమి యాధారము లేదని యాతని మాటలనుబట్టియే చెప్పవచ్చును ఉద్యోగములోనున్నంతకాలము రమేశచంద్రుని దొరతనము వారెక్కువ గౌరవించిరి ఉన్నతోద్యోగపదవులకుఁ గొనిరావలసి వచ్చినప్పుడు ఇతనిహక్కులెప్పుడును మఱచియుండలేదు, ఇంతియగాక పైన వివరించిన ప్రకారము ఇంగ్లీషు వారికి నొసంగవలసిన యుద్యోగముల నీతనికే లభింపఁజేసిరి మఱియు నితని మంచిపనుల విశేషముగా నామోదించిరి తుద కితని తప్పులనుగూడ నంతగా పాటించి యుండరైరి ఇతనియందు దొరతనమువారు గొప్పతప్పిదమును కనుగొనియే యుండలేదు

ఇతఁ డిట్లింత శీఘ్రముగా ఉద్యోగమును మానుకొనుటకు గల కారణములు రెండు -

(1) రమేశచంద్రుఁడు విద్యార్థిగా నున్న కాలమునందయు భాషాసేవయందు తన జీవితమును వినియోగింప వలెననియు

నదియే తన 'ప్రథమప్రేమ' యనియుఁ దలంచుచుండెను సప్త సంతానములలో నొకటియై చిరస్థాయిగా నుండెడి కృతు లొనర్ప వలెననియు, ముందువచ్చు ప్రజల కీ గ్రంథము లుపయోగించుననియు అదియే తన విధాయక కృత్యమనియు నతఁడు విశ్వసించెను ఇప్పటివఱకు అతఁడుద్యోగములోనుండి సకల వైభవముల ననుభవించెను వయస్సున 50 సంవత్సరములు నిండిన వాఁడాయెను ఉపకార వేతనము కూడఁ బొందెను కావున మిగతకాలమునందు ' నేనిఁక లక్ష్మిని విడిచి సరస్వతిని సేవింతును గాక '' అని యతఁడు నిశ్చయించు కొనెను

(2) ఇండియా పరిపాలనయందు దారసంస్కారణములం బొందుపఱచుటకు కాలము పరిపక్వము చెందియుండెను అధినివేశ (Colonies) రాజ్యములందువలె స్వరాజ్యమును (Self Goveinment) జనులు గోరుచుండిరి కావున సంస్కారణాభివృద్ధికై సంపూర్ణముగా పాటుపడుటకు స్వాతంత్ర్యమును, అవకాశమును, రమేశచంద్రుఁడు కోరెను పరిపాలనావిధానమునందు జనులకు కొంత ప్రవేశముండినయెడల హిందూదేశము నందు బ్రిటిషు ప్రభుత్వము న్యాయబద్ధమైనదిగను, జనసమ్మతిమైనదిగను నుండునని పరిపాలనయందు తనకుఁగల దీర్ఘానుభవమువలన రమేశచంద్ర దత్తునకు తోఁచెను కావున దేశీయులనైన యీ ప్రయత్నమునందు తానును జేరి యీ యాదర్శమును సాధించుట యందు తోడుపడుట కర్తవ్యమని యాతని యంతరాత్మ తీవ్రముగా ప్రబోధించెను

శీఘ్రకాలములో నుద్యోగమును మాన్పఁజేసిన వీరెండు కారణములచే ఇట్టివింతగోర్కె లింతచక్కని యుద్యోగసంబంధమును వదలుకొనఁజేసెనాయని జనులు విస్మితులైరి. కాని 1897-వ సంవత్సరమునుండి యాతని ప్రవర్తనమును బరిశీలించుచున్నవా రాతఁడు తన యంతరాత్మకు బద్ధుఁడై ప్రవర్తించుచుండెనని యొప్పుకొనకమానరు. ఇంతకన్న స్వార్థత్యాగము మఱియెద్ది? ఆహా! ఏమి యీమానవుని స్వదేశాభిమానము?

## దేశసంచారము

### I

దేశసంచార మొనర్చుటయందు రమేశచంద్రున కెక్కుడు ప్రీతిగలదు

“ప్రతివిద్యాధికుఁడును వీలైనంతవఱకు దేశాటనము సలుపవలయును. దేశసంచారము మనమును వికసింపఁజేయును, భావములను విస్తరింపును, సానుభూతిని వృద్ధిపఱుచును. ఇంతియగాక క్రొత్తతలంపులను క్రొత్తప్రేరేపణలను గ్రహించి యుపయోగములకుఁ దెచ్చుటకై మనలను తగినవారిగాఁ జేయును. ఇండియాయందు పుట్టి పెఱిగిన మనము ఐరోపా, అమెరికా ఖండములలోని నవనాగరికపద్ధతుల ఫలములను స్వయముగా వీక్షించి యుత్తమ ఫలంబులనొసంగు పద్ధతులను స్వజాత్యభివృద్ధికొఱకు నవలంబింతుమేని గణనాతీతమైన లాభమును బడయఁగలము. జ్ఞానమునకును, ఆహ్లాదమునకును, ఉత్పత్తిస్థానములగు నీప్రదేశములనుండి వనచుట్టుపట్లనుండు ప్రపంచమంతయు లాభమును బొందుచుండఁగా అజ్ఞానులమై, స్వయంకృతాశక్తులమై మనమేల ప్రతిరోధకులముగావలయును?”

అని రమేశచంద్రుఁడు పలికియున్నాఁడు. ఇట్టి యున్నతాదర్శ్యము కలవాఁడగుటచే ఏమాత్రము సెలవు దొరికినను, ఎట్టి యవకాశము చిక్కినను, దేశసంచారమునందే వినియోగించెను. నాగరికములకును, చారిత్రకవిశేషములకును, ప్రసిద్ధికెక్కిన దేశములును, పట్టణములును మాత్రమే యతనికి ప్రియతమములై యుండలేదు. అతఁడు వెళ్లినచోట్ల నెల్లఁగల బీదలు మొదలుకొని రాజాధిరాజులవఱకుఁగల మానవుల జీవితములను ఆయాప్రదేశంబులయందుండెడి నగరులను, కట్టడములను, వాని చరిత్రములను నెంత విమర్శతోఁ బరిశీలించినదియు నతఁడు వ్రాసిన పుస్తకములయందు వివరించియున్నాఁడు.

"తాము తిలకించు హిందూదేశభాగములందలి హైందవాచారవిశేషములయొక్కయు, జీవితపద్ధతులయొక్కయు, స్వారస్యమును మనదేశస్థులలో కొలఁదిమందిమాత్రమే గ్రహింపఁగలిగియున్నారు. దేవాలయములయొక్కయు, మసీదులయొక్కయు, పల్లెటూరిపండుగలయొక్కయు, హృదయస్థమైన హిందువుల భక్తియొక్కయు సౌందర్యమును కొలఁదిమంది మాత్రమే మెచ్చుకొనుచున్నారు. బాహ్యాకమైనవిద్యయు, పాశ్చాత్యపద్ధతులను అనుకరించుటయందేకాలము దప్పు జీవితములును, మనదేశములో మనధర్మములయందును మన జీవితములయందును గల యానందమును కనుఁగొనలేనంత గ్రుడ్డివారలనుగా మనలను జేయుచున్నవి. చూచుటకు కన్నులు గలవానికిని అనుభవించుటకు యోగ్యతగల వానికిని భారతఖండమునందలి ప్రతిస్థలమును ఆనందప్రదమైనదిగానే కన్పట్టఁగలదు."

అని హిందూదేశమును గూర్చి వ్రాసియున్నాఁడు.

విద్యార్జనమునకై యింగ్లండు వెళ్లినప్పుడు అతఁడా 'సివిల్‌సర్వీసు' పరీక్షయందు కృతార్థుఁడగుటకై దివారాత్రములు చదువుటయందే నిమగ్నుఁడై యుండినను, అప్పుడప్పుడును పరీక్షానంతరమునను నచ్చటి ప్రదేశంబులఁ దిలకించి స్వదేశమునకు మరలినటుల వెనుక వ్రాసియున్నాము. ఆసందర్భమున రమేశచంద్రుఁడు తనయన్నకు వ్రాసిన యుత్తరములోని కొన్ని వాక్యముల నిటఁ దెల్పుట యవసరమని నమ్ముచున్నాము —

" ఇంగ్లండులోని విచిత్రమైన స్థలముల నన్నింటిని చూచినాఁడను. ఇంగ్లీషువారియొక్క సుశీలము, పద్ధతులు, ప్రతిదినచర్యమొదలగు వానిని బట్టి నాకుముందుపయోగకరముగా నుండుటకై కొంత నేర్చుకొనఁ గలిగితినని కూడ తలంచెదను. మనకు హిందూదేశములో ప్రాచీనమైనట్టియు ప్రసిద్ధమైనట్టియు, నాగరికత కలదు. కాని అటులున్నను మనము నవనాగరికతను గూర్చి యెక్కువ నేర్చుకొనవలసియున్నది. ఇంగ్లండుతోడను యూరోపుతోడను మనకు సంబంధముకలిగిన కొలఁది మనకు ముఖ్యముగా కావలసియున్నట్టియు, నేఁడు యూరోపుఖండమందు విరివిగానున్నట్టియు కొన్ని సుగుణములను సుప్రసిద్ధనియమములను మన మవలంబింతము. పరిశ్రమలు వెంపుచేయుట యందును, వాణిజ్యాభినివేశమందును, ప్రాతినిధ్య పరిపాలన యందును, నిజమైన సాంఘికపురోభివృద్ధియందును, హిందూదేశము ప్రపంచమందలి యితర దేశములతో తులదూగుదినమువచ్చును. దాని సౌభాగ్యము మన సంతతి సంతతివారికి మాత్రమే లభించును. యుక్తకాలములో నట్టిదిన మిండియాలో ప్రభవించునుగాక "

II

అతఁడు ఇంగ్లండునుండివచ్చినతరువాత హిందూదేశమునందువిహరింపసాగెను. అతఁడువిద్యాస్థానమగుకాశీపట్టణమును

గూచి, అచ్చటినుండి లక్నో (లక్ష్మణపురి) కు వెళ్లెను సిపాయి కలహము నాటి యచ్చటి గుర్తులన్నియు చూచి ప్రసిద్ధ నగరరాజంబగు ఢిల్లీకి వెళ్లెను శిథిలములయిన పురాతన ఢిల్లీ స్థలంబులను, మధ్యకాలములోని చరిత్ర సంబంధములగు ననేక జ్ఞాపక చిహ్నములను విలోకించెను ఆగ్రాలో హిందువుల శిల్ప శాస్త్ర ప్రావీణ్యమును దెలుపునట్టి 'తాజ్ మహాలు' మొదలు గాగల కట్టడములను చూచి, ఫత్తేపూరు సిక్రీకి వెళ్లి యచ్చటి శిథిల ప్రదేశములం గని సంతసించెను అచ్చటినుండి ఓఢ్ర దేశమునకు వెళ్లి దానినిగూర్చి తన యభిప్రాయము నీరీతిగా వెల్లడించి యున్నాడు —

"హీనస్థితిలోనున్న ఓఢ్రదేశము 15 శతాబ్దములనుండి యెడతెగని చరిత్రగలదనియు, హిందూశిల్ప శాస్త్రముయొక్క దివ్యతమమైన చిహ్నములగు దేవాలయములకు ప్రసిద్ధికెక్కినదనియు మాచిన్నతనమందు మేమెన్నఁడును నమ్మియుండలేదు రెండువేల సంవత్సరములకు పూర్వము ఈప్రదేశము బౌద్ధమతమును, ఆర్యనాగరికతను, అవలంబించినదనియు, హిందూదేశమునందు మనము కనుగొనువానిలో నోఢ్రదేశములోని బౌద్ధవిహారములు మిక్కిలి పురాతనములయినవనియు, మేము నమ్మఁజాల పోతిమి అయిన నదియే నిజము నవ్యహిందూదేశమును గప్పికొనిన అంధకారపటలమును బైకెత్తినయెడల ప్రతిస్థలమందును, దీర్ఘకాలపరిమితి గలిగినట్టియు, ప్రఖ్యాతికెక్కినట్టియు ముఖ్య చిహ్నములను మనము కనుగొందుము ఈ చిహ్నములు పూర్వకాలములో యుద్ధమందును శాంతపరిపాలనమందును మన వారొనర్చిన ఘనకార్యములను విశదీకరించుచుండును తన్నుగూర్చి మాత్రమే బోధించెడ పాఠములతో నిండియున్న ప్రస్తుతవిద్యనువదలి తాము పూర్వకాలమందు ప్రసిద్ధికెక్కిన వారమని బోధించువిద్యను నవ్యభారతీయుఁడు తనంతటతానె నేర్చుకొనవలసియున్నది"

తఱువాత నతఁడు చూచినది జయపురనగరము అచ్చటి భయంకరమగు చాముండాదేవి విగ్రహమునుజూచి దాని పనితనంబునకును పూర్వ హిందువులు శిలాప్రతిమలు చేయుపద్ధతికిని మిగుల అచ్చెరువందెను జయపురమునుండి కటకమునకును అచ్చటనుండి యుదయపురమునకును, అనంతరము ఖండగిరికిని పిమ్మట భువనేశ్వరమునకును వెళ్లెను

III

రమేశచంద్రదత్తు 14 సంవత్సరముల ఉద్యోగానంతరము 1885-వ సంవత్సరమున రెండు సంవత్సరముల "ఫర్లో సెలవు" తీసికొనెను ఈ సెలవుకాలమందే చాలభాగము గ్రంథరచనయందును ఇతర కార్యములయందును గడపెను కాని యతని దేశసంచారాపేక్ష యాతనిని బల్లకడఁ గూర్చుండ నియ్యకపోయెను !

రమేశచంద్రదత్తు మొట్టమొదట రాజపుత్రస్థానము, మధ్యహిందూదేశము (సెంట్రలు ఇండియా) లోని జయపురము, అజమీరు, యోధపురము, ఆబు, చిత్తూరు, ఉజ్జయిని మొదలుగాగల ప్రసిద్ధ స్థలంబుల విలోకించి 1886-వ సంవత్సరము ఏప్రిల్ 15-వ తేదిని బిడ్డలతోను, సోదరుఁడగు జోగీశచంద్రునితోను, ఐరోపా ఖండమునకు ప్రయాణమయ్యెను ఇతని బాల్యమిత్రుఁడగు విహారిలాలుగుప్త ఇదివఱకే వెళ్లియుండినందున వారి నతఁడక్కడ కలిసికొనెను ఇట్లు భార్యను బిడ్డలను, సోదరుని యూరోపునకు తీసికొనిపోవుట వారికి

నింగ్లీషువారి నివితపద్ధతులను నాగరికమును జూపుటకును, ప్రపంచానుభవము కొఱకు నని యతని యుత్తరములనుబట్టి తేలుచున్నది

జనప్రతినిధి సభలో ఐర్లాండు 'స్వారాజ్యము' నుగూర్చి జరుగుచున్న వాదప్రతివాదములను తిలకించుచు లండను పురమందు కొన్నిదినము లుండెను ఆక్సుఫర్డుకువెళ్లి వేదశాస్త్ర పారంగతుండయిన మోక్షమూలరు (మ్యాక్సుముల్లరు) ను దర్శించి ఆమహామహునితో పరిచయము కలుగఁజేసికొనెను ప్రపంచమును నెక్కువగఁ జూడఁగోరిన వాఁడగుటచే మొట్టమొదట ఉత్తరద్వీపమునకు వెళ్లెను అచ్చటి నుండి బయలుదేఱి సుందరమయిన నార్వేస్వీడను దేశములను సందర్శించి తరువాత ఫ్రాన్సు, బెల్జియం, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ దేశములందు సంచరించెను యూరోపుఖండమునందలి ప్రసిద్ధ స్థలములగు ప్యారిసు, బ్రసెల్సు, వాటర్లూ, అముస్టరడం, హానోవరు, బెర్లిన్ డ్రెసడెన్, ప్రేగు, వియానా, వెరోనా, ఫ్లోరెన్సు, రోము మొదలగు ప్రదేశములను తాను తిలకించిన విధమును, వానివర్ణనయు, అచ్చటి ప్రజలస్థితిగతులును తన యనుభవమును, 'రాంబుల్సు' అను గ్రంథమునందు విరివిగా వర్ణించియున్నాఁడు ఇట్లు యూరోపుఖండమునందంతటను విహరించి ఇంగ్లండునకు తిరిగి వెళ్లెను అనంతరము కొద్దికాలముననే బయలుదేఱి సకుటుంబముగా స్వదేశమునకు పయనమయ్యెను

# IV

1892 వ సంవత్సరమునందు తిరిగికొనిన 'పర్లోకెలవు' లో చాలభాగ మిదివఱకువలెనే దేశాటనమందే వినియోగించెను ఆసంవత్సరము శీతకాలమంతయు తనబాల్య స్నేహితుఁగు విహారిలాలుగుప్తతో ఉత్తర హిందుస్థానమందలి కాశ్మీరము, పాంచాలము, హరిద్వారము, మొదలగు ప్రదేశములను వీక్షించుటయందుగడపి 1893-వ సంవత్సరారంభమున యూరోపునకు వెళ్లెను

బరిడ్వానునందుండఁగా నచ్చటి విషవాయువుల వలన నితని యారోగ్యముచెడెనని వ్రాసియున్నాము ఇంగ్లండు వెడలఁగనె యచ్చటి యతి శీతలముచేత బరడ్వానలో తగిలిన చలిజ్వరము (మలేరియా) ప్రబలినందున నితఁడనేక దినములవఱకు మంచము పట్టెను ఇట్టి యనారోగ్యస్థితిలోనున్నను మంచము చుట్టును పుస్తకములను కాగితములను ఉంచుకొని వానిని సవరించుచుండెనఁట అప్పుడా గృహయజమానురాలగు ఆంగ్లేయనారిమణి వానినన్నిటిని నచ్చటినుండి తీసివైచెనఁట శరీరము కొంచెము స్వస్థతపడఁగానె జర్మని దేశమునకు ప్రయాణమయి యచ్చటి 'వీసుబేడెన్' అను ప్రదేశమందు కొన్నిలోహముల చేరికవలన ఔషధగుణములుగల నీటిని స్నానపానంబుల కుపయోగించుచు నుండెను జర్మనీ భాషలోని వ్యాకరణములతో, వాచకపుస్తకములతో కొంత కాలముపుచ్చెను గాని యా భాషయందంతగఁ బ్రావీణ్యముఁ బడయలేదు ఫ్రెంచిబాషతో నతని కెక్కుడు పరిచయముకలదు. ఫ్రెంచి చరిత్రకారు లతని

నిరంతర స్నేహితులు ఇంగ్లీషు చరిత్రకారులకంటె ఫ్రెంచి చరిత్రకారులకు వర్ణనాచాతుర్యమును విషయగ్రాహకశక్తియు నెక్కుడని యాతని యభిప్రాయము. ఐరోపాలోని ప్రస్తుత భాషలను చదివించకపోవుట హిందూదేశమునందలి ఉన్నత విద్యాపద్ధతిలోని గొప్పలోపమని యాతని తలంపు ఎవఁడైనను, ఇంగ్లిష, ఫ్రెంచి, జర్మనీ, భాషలయందు ప్రవీణుఁడు కాని యెడల చరిత్రయందుకాని, శాస్త్రమందుకాని, పరిశోధన మందుకాని లేక దేనియందైనను పరిపూర్ణ ప్రజ్ఞావంతుఁడగుట దుస్సాధ్యమని యాతఁడు త్రికరణశుద్ధిగా నమ్ముచుండెను

### ఇంగ్లండునందు నివాసము

1897-వ సంవత్సరమున రమేశచంద్రుఁడు ఉద్యోగమును వదలుకొని నటుల పైన వ్రాసియున్నాము అతఁడు వెంటనే బయలుదేఱి ఇంగ్లండునకు వెళ్లి 1904-వ సంవత్సరము వఱకు అచ్చటనే నివాసమేర్పఱచుకొనియెను రమేశచంద్రుని సతీతిలకమును, చిన్నకొమార్తెయు అతనితో నింగ్లండునకు వెళ్లిరి కొమారుఁడగు 'అజయచంద్రదత్తు' ఆదివఱకే వెళ్లియుండెను ఇతఁడు ఆక్స్ఫర్డులోని 'క్రీస్టుచర్చి' అను కళాశాలయందుచేరి అచ్చటనే పట్టపరీక్షాసిద్ధుఁడై, తరువాత బ్యారిస్టరు పరీక్షయందు జయమునుగొని భరతఖండమునకు వచ్చెను ఇటు సకుటుంబముగ రమేశచంద్రుఁడచ్చట నివసించి యుండుటచే తనజీవితమును విదేశమునందును, విదేశీయుల కొఱకు పాటుపడుటయందును వినియోగించుచున్నాఁడని

కొంద అతనిని పరిహసించిరి కాని వారి యాశయములన్నియు వమ్మయ్యె

తమ జీవితకాలమందు చాలభాగము హిందూదేశము నందు గడపినట్టియు, హిందూదేశమును ప్రస్తుతౌన్నత్య దశకు దెచ్చుటకు కారణ భూతులైనట్టియు ఉదారపురుషులగు నింగ్లీషువారితో మైత్రినెఱపుట హిందూదేశోన్నతికై పాటుపడఁ దలఁచిన వారికి ముఖ్యమైనట్టియు, ఫలప్రదమగునట్టియు మార్గమని యాతఁడు తలంచెను న్యాయావలంబకులని ప్రసిద్ధి కెక్కిన బ్రిటిషు ప్రజలకు మనహక్కులను నివేదింపఁబూనుకొనెను హిందూదేశముయొక్క పూర్వనాగరికతయు, జ్ఞానభాండారమును యూరోపియనుల కన్నులయెదుటఁ బెట్టివిస్మితులఁగావించుట యాతని యుద్దేశములలో ముఖ్యమయినది

తనహృదయస్థములగు నీతలంపులు సంపూర్ణజయము నొందుటకై అతఁడింగ్లండునందు ఏడుసంవత్సరములు స్థిరముగా నుండి, ఏకాగ్రచిత్తముగ కృషిసల్పి, తనబుద్ధిని, తనద్రవ్యమును తన పలుకుబడిని, మాతృదేశ సేవయందు వినియోగించెను పలువిషయంబులనుగూర్చి పత్రికలకువ్రాసెను, ఉపన్యాసములిచ్చెను, గొప్పవారిని సందర్శించి మాటాడెను, పుస్తకములు వ్రాసి ప్రకటించెను ఈ యేడు సంవత్సరముల మధ్యకాలములో రెండుమాఱులు మాత్రము స్వదేశమునకు వచ్చెను 1899-వ సంవత్సరమున లక్నోపురిలో జరిగిన కాంగ్రెసునకగ్రాసనాధిపతిగా నొకసారియు, శాంతిప్రతిపాదకులగు శ్రీ సప్తమైడ్వర్డు సార్వభౌముఁడు బ్రిటిషు మహాసామ్రాజ్య

భాగముగు వహించు యుత్సోత్సవ సందర్భమున 1902 వ సంవత్సరమందు ఢిల్లీ నగరములో జరిగిన దర్బారున కతిధిగ మఱియొకసారియు సాహిత్య రాజకీయ కార్యములన్నియు చాలభాగ మిక్కాలమునందె ఇంగ్లండున జరిపియుండెను మద్రాసుప్రెసిడెన్సికాలెజలోని సంస్కృతోపాధ్యాయపదవిం (Piolessoi of Sinskrit) దీసివేయ ప్రాంతనము వారు నిశ్చయించినప్పుడు ప్రొఫెసర్ రంగాచారి ఎం ఏ గారి ప్రోత్సాహము ఇండియా కార్యదర్శిగారితో పోరాడి, ఆపదవిని నిలుపుటయేగాక దానిని శ్రీరంగాచార్యులవారి కప్పించి చెన్నపురి రాజధాని వాసుల కృతజ్ఞతకు పాత్రుండైన దీసందర్భమున నె (1901) ఇతండిక్కడనుండియిల్లు హిందూదేశముతోఅకు పాటు పడుటచూచి మనవారెందఱితనిని దేవదూతయని భావించిరి ఈ సమయమునందె యొక ముఖ్యవిషయ మింగ్లండునందు జరిగినది లండను యూనివర్సిటికాలేజి సభాసదు లీతని మూండు సంవత్సరముల వఱకు హిందూదేశ చరిత్రోపన్యాసకునిగా నియమింప నిశ్చయించుకొన్నట్లు ఉత్తరము వ్రాసిరి (1897) దాని నతండు సంతోషపూర్వకముగ నంగీకరించెను ఇది యపూర్వమైన యుద్యోగము ఇట్టి దిదివఱకు మన దేశీయుల కెవ్వరికిని లభించియుండలేదు రమేశచంద్రుండా మూండుసంవత్సరములు ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షకుం బోవువారికేంగాక అచ్చటి యింగ్లీషు విద్యార్థుల కనేకులకు మిక్కిలి సామర్థ్యముతో హిందూదేశచరిత్రను బోధించి కీర్తిగాంచెను

1899 వ సంవత్సర ప్రకారము

1898, 1899 సంవత్సరములందంతటను రమేశచంద్రుఁడు హిందూదేశీయులనుగూర్చి యింగ్లండునందు పలుతావుల ముచ్చటించి వెలసి వచ్చెను. అప్పటి కాటకము, మహామారి, సరిహద్దునందలి యుద్ధము మొదలగు వానిచే నల్లకల్లోలముగానున్న హిందూదేశస్థితిని గుఱించి కొంత తెలిసికొనుటకు ఇతని యుపన్యాసములవలన బ్రిటిషువారికవకాశమబ్బెను. రాజద్రోహశాసనము, కలకత్తా పారిశుద్ధ్యసంబంధశాసనము మొదలగు వానినిగూర్చి యతఁడిచ్చిన యుపన్యాసములు కారణములతోను, ఉదాహరణములతోను నిండియుండినవి. హిందూదేశీయుల యభిప్రాయములం దెలుపుటకతఁడు తగినవాఁడని ప్రసిద్ధిం జెందెను. రమేశచంద్రుని దేశసోదరులందఱు అతని యుపన్యాసములను నెక్కువ యుత్సాహముతోఁ జదివి యుద్యోగానుభవమును, జ్ఞానమును, పరిపూర్ణముగఁ బెట్టుకొని హిందూదేశపక్షమున వాదించు నీ క్రొత్తపురుష పుంగవునకు స్వాగతమిచ్చి 1899-వ సంవత్సరమందు లక్నోపట్టణమందు జరుగనుండిన 15-వ హిందూదేశీయ మహాసభ కగ్రాసనాధిపతిగా నెన్నుకొను మూలమున తమ యానందమును వెలిపుచ్చిరి. అధికారేతరులగు స్వదేశీయులచేత నున్నట్టి గొప్ప పదవి యదియే కదా?

రమేశచంద్రుని పేరు మాత్రమే విన్న స్వదేశీయులు నాఁడా కాంగ్రెసు వేదికమీఁద నతనిని మొట్టమొదట చూడఁ గలిగిరి. అతనికప్పటి కేఁబదియేండ్లు నిండెనను, ఆతని దీర్ఘాకృతి,

దృఢకాయము, ఆజానుబాహువులు సభాసదుల నాశ్చర్య మనస్కులఁగావించెను. అతని యుపన్యాసము దేశీయుల నాశా భంగులఁగావింపక పోవుటయేగాక కాంగ్రెసు ఉద్దేశములకు క్రొత్తమార్గమును జూపెను. రాజప్రతినిధిగారి సభయందు ముగ్గురును, రాజధానీ కార్యనిర్వాహక సభలయందొక్కొక్క రును హిందూదేశీయు లుండవలయునని యీతఁడందు విశదీ కరించెను. హిందూదేశములోని కృషీవలులను గురించియు భూస్వాములను గురించియు, వారిచ్చుకొనుచున్న భారమైన పన్నులను గురించియు, అందుచే వ్యవసాయము చెడి క్షామ ములు తఱచు సంభవించుటను గూర్చియు అతఁడాదు నొక్కి చెప్పెను. హిందూదేశములోని మితిమీఱిన భూమిపన్నులను గూర్చి యతఁడు రణభేరిమ్రోగించెనని యందఱనుకొనిరి. అతి నిని జూచిన వారతఁడు నిజముగా యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యె ననియే తలఁచిరి.

కాంగ్రెసునకెప్పుడు విరోధముగా వ్రాయుచు ఆ మహా సభయొక్క నిస్తేజమును మన్నింపఁగూడదని నొక్కి చెప్పు చుండెడి ఆంగ్లేయ హైందవ (ఆంగ్లో ఇండియను) పత్రికలగు ఇంగ్లీషుమెన్, స్టేట్సుమెన్, టైమ్సు ఆఫ్ ఇండియా మొదలగు నవికూడ తమ యున్నతసౌధమునుండి క్రిందికిదిగి కాంగ్రెసు తీర్మానములకు గౌరవము చూపుస్థితి నీతని యుపన్యాసము వలనఁ గలిగెను. ఈ పత్రికలీయుపన్యాసముతో సంపూర్ణము గా నేకీభవింపకపోయినను, రమేశచంద్రుని ధిషణాధౌరంధర్య మునెక్కువగాఁ బొగడెను. ఇఁక స్వదేశీయుల యొక్కయు

స్వదేశపత్రికల యొక్కయు ఆనందమునకు మితియుండునా? లండనులోనుండు ఇండియా కార్యదర్శిగా రగు లార్డు జార్జి హామిల్టనుగారుకూడ దీనింజదివి రమేశచంద్రుని భూషించుచు, అతఁడు వేసిన ప్రశ్నలకు సమాధానము చెప్పుకొనవలసివచ్చెను ఇండియా కార్యదర్శి, వైసురాయ్, గవర్నరులు, లెప్టినెంటు గవర్నరులు మొదలగు ఇండియాపరిపాలకు లల్లకల్లోలపడి యీతని యభియోగమునుండి తప్పించుకొనుటకై లెక్కలను త్రిప్పివేయసాగిరి

కాంగ్రెసుసభ ముగిసినతరువాత పలుతావుల నతని కనేకులు విందులుచేసి సమ్మానించిరి కలకత్తాయందు సమావేశమయిన గొప్ప మహాసభయందు అచ్చటి పౌరులపక్షమున ఉమేశచంద్రబనర్జి చక్కని యుపన్యాస మొసఁగి రమేశచంద్రునకు విన్నప పత్రిక నొసంగెను ఆ సమయమున, మానవునకు దేశసేవయే గొప్ప యుద్యోగ మనియు, దేశీయులు చూపు గౌరవము ప్రేమ బిరుదు లనియు, జవిత పరమార్థము నందు వీనికన్న నెక్కువది లేదనియు తన సహజవాగ్ధాటితో సురేంద్రనాథుఁడు పలికెను

## కర్జను ప్రభువుతో వాదము

రమేశచంద్రుఁడు లక్ష్మణపురినుండి కలకత్తాకు వచ్చినప్పుడు కర్జను ప్రభువును సందర్శించి చాలసేపు మాట్లాడెను అప్పుడా రాజప్రతినిధిగారి యెదుట రెండువిషయములను గూర్చి చర్చించెను

మూఁడవది బ్రిటిషువారు జమీందారీ భూములమీఁద వేసికొనిన నాఁడు ఏర్పడిన న్యాయబద్ధమగు సంబంధమును, సెటిలుమెంటువారి యధికారమును మెరదప్పనియ్యక యుండునట్లుగను ఒక విధముగా నిర్ణయముచేయవలెనని ప్రార్థించెను. ఆయన చెప్పవలసిన కారణము లన్నింటిని శ్రద్ధతోఁ బ్రభువు విని, వానినిగూర్చి బాగుగ నాలోచించెదనని చెప్పెనుగాని స్పష్టమైన వాగ్దత్త మిచ్చుటకు వప్పుకొనలేదు.

రెండవది దేశపరిపాలనావిషయమున స్వదేశీయులకు కొంత ప్రవేశమియవలసిన దనియు, గవర్నరుజనరలుగారి వెంబడియు బంగాళాలమొక్కయు కార్యనిర్వాహక సభలలో నింటియనులకు కొంత ప్రవేశము కలుగఁజేయవలసిన దనియు రమేశచంద్రుఁడు కోరెను.

ఈ విషయమునుగూర్చి కొంతే వాదప్రతివాదములు నడిచిన తరువాత తన సహజంబగు "మొత్తముమీఁద హిందూదేశమునకు ఒక్క యధికారి పరిపాలనమే మంచిపద్ధతికాదా" యను ప్రశ్నతో కర్జను ప్రభువు నాఁటిప్రసంగమును ముగించెనఁట!

రమేశచంద్రుఁడీవిషయము నింతటితో వదలక తుదవఱకు పరిశీలింపఁ దలఁచెను. తాను భూమిపన్నులనుగూర్చినోటితో చెప్పిన దంతయు కర్జనుగారికి ప్రకటితలేఖలు (Open-Letters) వ్రాసి పత్రికలయందు ప్రచురించెను. తరువాత వీనినే

ఎక్కువ క్రొత్తసమాచారమును జేర్చి ఇంగ్లండునందు గ్రంథ రూపమున వెలువరించెను. ఈ యయిదుశాఖల యందు ముఖ్యపరిగణాలు, బెన్నపుర్, గోరఖాఘు, బంగాళా, ఉత్తర హిందూస్థానముల యందలి భూమిశిస్తు పద్ధతులనుగూర్చి వివరింపబడియుండెను. రమేశచంద్రుని కాంగ్రెసు ఉపన్యాసములను ఈ గ్రంథమువలనను హిందూదేశమందలియు ఇంగ్లండు నందలియు దొరతనమువారు తారుమారయి విధేశక ఊరని వాదమును కొంతవఱకు నొప్పుకొనుచు, కొన్ని నియమములను మాత్రమప్పటికిచేసిరి!

## బరోడా రాష్ట్ర పరిపాలన

నానాదేశవిహార వికసిత హృదయపంకజుండును, బహు గ్రంథావలోకనాజనిత వివేకసారుండును, సాంఘిక, రాజకీయ, ధార్మిక, శాస్త్రమర్మజ్ఞుండును, పాలితజనానందసంధాయక శ్రీరామచంద్రుండును, నిఖిలస్వదేశసంస్థానాధిపరాజిత తారా గణకుముదబాంధవుండును, బరోడారాష్ట్రపాలకుండును, అగు లోకమాన్య శ్రీ మహారాజా సయాజిరావుగాయకవాడు బహదూరు, కె సి ఐ ఇ గారు రమేశచంద్రుని గ్రంథములం జదివియు పరిపాలానాశక్తిని గమనించియు, అసమాన సామర్థ్యం బుల తెలిసికొనియు సంతోషభరితస్వాంతులై యతని 1895 సంవత్సరములో బరద్వాను పరిగణాకు కమీషనరుగా నుండిన సమయమందు తన రాష్ట్రపరిపాలనావిధానమునందు తోడు పడవలసినదిగాఁ గోరుచు అతనితో ఉత్తర ప్రత్యుత్తర ములు జరిపెను. రమేశచంద్రుఁడందులకు తన కృతజ్ఞతను

తెలుపుచు ఆ విషయమును తాను ఉద్యోగమును మానిన పిదప నాలోచింప ననుజ్ఞ నీయవలసిన దని యారాజపుంగవునకు విన్నవించెను. మాతృదేశసేవాభినిరతుఁడై రమేశుఁడు బ్రిటిషు ప్రభుత్వసేవానంతరము ఇంగ్లండు నందు విధి విరామములు లేకుండ జయప్రదముగ ఏడుసంవత్సరములు కృషిసల్పి 1904-వ సంవత్సరమున కాళీఘట్టమునకు చేరఁగనే గాయకవాడువద్ద నుండి తొమ్మిదిసంవత్సరముల నాఁటి వాగ్దానమును నెరవేర్ప వలసినదని యాహ్వాన మొచ్చెను. దత్తు మహాశయున కప్పటికి 55 సంవత్సరములు నిండియుండెను. పనిచేసి చేసి యతఁడలసియుండెను. గొప్పపదవులనంది విద్యాధనకీర్తులఁ బడసియుండెను. విశ్రాంతికై యెదురు చూచు చుండెను. అయినను గాయకవాడువంటి రాజచంద్రుని యాహ్వానమును రమేశచంద్రుఁడు నిరాకరింపలేకపోయెను. ఇదియునుగాక విధి లేక లోపల నణఁగియున్న తన శక్తిసామర్థ్యముల విచ్చలవిడిగ నుపయోగించి రాజ్యపరిపాలనయందు హిందువుల కెంత కౌశల్యము కలదో చూపుట కిదియదన నని తలంచెను. తానిన్ని సంవత్సరములనుండి బ్రిటిషుపరిపాలనయం దేయే సంస్కారము లావశ్యకము లని ప్రబలప్రమాణముగ వాదించుచుండెనో వానిం జేయుటకు బ్రిటిషు గవర్నమెంటు వారు జంకుచుండిరో వాని నన్నింటియొక్క బీజములను నాటి ప్రయోగపూర్వకముగ సుఫలితములను జూపుటకు బరోడా రాష్ట్రము సుక్షేత్రమని యెంచెను. ప్రజలస్థితిగతుల నారసి క్రియాపూర్వకముగ వారికెంత మేలు చేయఁబూనుకొనెను. ఇట్టి మనోగతాభిప్రాయములతో రమేశచంద్రుఁడు

బరోడా రాష్ట్రపురివిన్యామంత్రిత్వము నొప్పుకొనెను ఇట్లు 1904-వ సంవత్సరము ఆగస్టుమొదలుకొని 1907-వ సంవత్సరము జులైవఱకు - మూఁడుసంవత్సరములు - ఆ యున్నతో ద్యోగమును బహుసమర్థతతో నిర్వహించి ప్రభువును, ప్రజలను ప్రమోదభరితులఁగావించెను

రమేశచంద్రుని మంత్రిగానేర్పాటుచేసిన గాయకవాడు యొక్క బుద్ధివైశద్యమును గొనియాడి గొప్పగొప్ప గవర్నర్లాది గాగలవారలాకృపెంద్రునిమిగుల బహూకరించిరి "మనప్రాణమానములఁగాపాడ బీదజనుల సంరక్షకుఁడును, న్యాయమూర్తియు నగు ఒక బంగాలీబాబు విచ్చేసియున్నాఁ"డని రమేశుని గుఱించిస్త్రీపురుషాదులు అతిసంతోషముతోఁజెప్పుకొనసాగిరి ఇంతయేల ఆరాష్ట్రములోని కోటీశ్వరులు మొదలు కగుబీదల వఱకు అతనియం దత్యంతభక్తిగలవారై దైవసమునిగా నెంచిరనిన యతిశయోక్తి యెంతమాత్రమును గాదు

రమేశచంద్రుఁగు రివిన్యామంత్రిగా నుండిన మూఁడు సంవత్సరముల కాలములో నాతఁడు చేసిన మార్పులను, వానిఫలితములను, ఈ చిన్నపుస్తకమునందు సంక్షేపముగా వర్ణించెదము ఇవియన్నియు రాష్ట్రీయవార్షిక వృత్తాంతములయందు విరివిగా వర్ణింపఁబడియున్నవి

## సంస్కరణములు

అనేక సంవత్సరములనుండి బాకీపడియున్న భూమిశిస్తు మున్నదిలక్షులవఱకు రద్దుచేయఁబడెను అందుచే రయితులు తల ఎత్తుటకు వీలుకలిగెను బీద ఎఱు పశివాండ్రును బేరగాండ్రును,

గాలిలును, ఇచ్చుకొనుచున్న వృత్తి పన్నులనేకములు నిర్మూలముచేయఁబడెను దీనికిబదులుగా భాగ్యవంతులు మాత్ర మిచ్చుకొనునట్లు ఆదాయపు పన్నొకటి నియమింపఁబడెను ప్రప్రథమమున సంవత్సరమునకు రు 150 ల ఆదాయము మీఁదనే యున్నట్లుచుండెరిగాని రమేశచంద్రుఁడా రాష్ట్రమును విడువకమునుపే ఆమితి క్రమముగా 300 లకును, 500 లకును. తరువాత 750 రూపాయలకును హెచ్చింపఁబడెను వాణిజ్యమును బాధించెడి పన్నులనుతీసివైచి ఎక్కువయాదాయమును దెచ్చెడి కొన్నింటిమీఁద వాణిజ్యమును బాధింపకుండు నట్టులు పన్నులు నిర్ణయింపఁబడెను రాష్ట్రములోని పన్నెలన్నిటియందును మద్యాదిగాఁగల వస్తువులపై పన్నులు పొత్తిగా లేకుండఁజేయఁబడెను భూమిపన్నులుతగ్గింపఁబడెను పన్నులనిట్లుతగ్గించినను నితర దేశములలోవలె బరోడాయందును ఆదాయమెక్కువయి వాణిజ్యాదులు విజృంభించె ననుట ప్రశంసనీయమునుగదా? పరిశ్రమలకును, పరిశ్రామిక యత్నములకును అధిక ప్రోత్సాహము కలుగఁ జేయఁబడెను సంఘమునకును సంస్థానమునకును ఏమాత్రము పోటీ లెకపోయెను బరోడా దొరతనమువారి ప్రత్తికర్మాగారము జనుల కమ్మివేయఁబడెను క్రొత్తయంత్రశాలలు రెండు కొలఁదికాలములోనె తలయెత్తెను ఈ క్రొత్త పరిపాలన వలని సౌకర్యముల వలన మాది ఏకు (Cotton ginning) యంత్రశాల లనేకములు స్థాపింపఁబడెను ఈ కారణములచే కూలివాండ్రెక్కువగా కావలసివచ్చిరి అంత కూలివాండ్రస్థితి మిక్కిలి బాగుపడెను

అధికారన్యాయశాఖలు పూర్తిగ విడదీయఁబడెను ఈ సంస్కరణమును జేయుటకు బ్రిటిష్‌ప్రభుత్వమువారింకను వెనుకంజ వేయుచున్నారు పరిపాలనాసౌకర్యమునకు భంగము లేకుండ న్యాయశాఖోద్యోగులు సివిలు, క్రిమినల్ వ్యవహారముల నిష్పక్షపాతముగ పరిష్కరించుచున్నారు గ్రామపంచాయతులు నేర్పాటుచేయఁబడెను వీరికి గ్రామములో జరుగుచుండు చిన్న చిన్న నేరముల విమర్శించి నేరస్థునకు రు 5 - లవఱకు జరిమానా విధించుటకును, 48 గంటలవఱకు కయిదులో నుంచుటకును, అధికార మియ్యఁబడెను ఇంక చే జనులు చీటికి మాటికి కోర్టులకెక్కి ఇల్లు గుల్లలుచేసికొని అబద్ధములకును అప్రమాణములకును లోఁబడి నీతిదూరులగుటకు అవకాశము లేకపోయెను న్యాయవిచారణ సంబంధించిన విషయముల చర్చింప మహాసభ లేర్పడెను ఈ సభలకు న్యాయాధిపతులు దండవిధాయకులు, న్యాయవాదులు మొదలగు వారినేకులు విచ్చేసి 'న్యాయ' సంబంధమయిన యనేకాంశములఁ జర్చించుచుండిరి న్యాయశాస్త్రముల నిర్మించుటయందునీసభలమూల్య సహాయ మొనర్చుచుండెను ఈ సభలకు మండలన్యాయాధిపతి యగ్రాసనాధిపతిగా నుండును

ఈ పరిపాలనాసంస్కారముల కన్నిటికి శిరోభూషణ మనఁదగునది కార్యాలోచనా సభా (Executive Council) స్థాపనము ప్రభుత్వాధికార మంతయు నీసభకు చెందెను 1904 05 లో క్షామ నివారణోపాయముల నవలంబించుట యందు శ్రీ గాయకవాడు మహారాజుగారి కది చాల సహాయ మొనర్చెను

శ్రీవారు దేశాంతరములకు వెళ్లినప్పుడు ఈసభకు 'ప్రధాన మంత్రి' యె యగ్రాసనాధిపతిగా నుండును

క్రిందినుండి మీఁదివఱకును వల యల్లినట్లు 'స్వరాజ్య పద్ధతి' (System of Self Government) యల్లి వేయఁబడెను. శ్రీ రమేశచంద్రుఁడు గావించిన రాజకీయ సంస్కరణ ముత్యాలహారమునకు నిది కొలికిపూస వంటిది. ఈసంస్కరణ వలన నితని నామము తరితరముల పర్యంతము స్మరింపఁబడు చుండును

రాష్ట్రములోని గ్రామసంఘముల తిరిగి నేర్పాటుచేసి గ్రామ పరిపాలనాధికార మంతియు వాని కిచ్చిరి. కొన్ని కొన్ని గ్రామసంఘములు కలిసి తాలూకా సంఘమునకును, తాలూకా సంఘములు మండలసంఘములకును ప్రతినిధుల నెన్నుకొనున ట్లేర్పఱచిరి. ఆ యా గ్రామములందు వచ్చు నాదాయము ఆయాసంఘముల కిచ్చివేసి పాఠశాలలు స్థాపించుట, బాటలు నిర్మించుట, బావులుత్రవ్వించుట మొదలగు జనోపయోగ కార్యములుచేయు బాధ్యత వినిపై వేసిరి. గ్రామసంఘము లా మొత్తమునుండి ప్రతిసంవత్సరము పానోదకమునకై నూతుల త్రవ్వించెను. ఇట్లు అధికారులనుకొన్న దానికంటె నెక్కువగ తమ విధులను జయప్రదముగ సాధించి వారిని విభ్రాంతులఁ జేయుటయేగాక నమ్మిన మొదల నీ గ్రామీణులు నెంతటి కార్యములైనను నెరవేర్పఁగలరనిలోకమునకుచాటెను. కొంత మంది నియోజకులతో (Elected members) కూడిన శాసననిర్మాణసభ యేర్పాటుచేయఁబడెను. స్వరాజ్యదివ్య

భవనమునకు నది మూల స్తంభము ఈ సభయందు 18 మంది సభ్యు లుందురు అందు ఆరుగురుమాత్రము జనులచే నెన్నుకొనఁబడుదురు దీనికి ప్రధానమంత్రి (దివాన్) అధ్యక్షుఁడుగా నుండును

ఇట్లు ప్రతికార్యమును ప్రజాప్రతినిధులు బాగుగానాలోచించి కార్యనిశ్చితము చేయుటకు వారికి నవకాశమబ్బెను అనఁగా ప్రజలే ప్రభుత్వమును చేయుచుండిరి!

"వ్రతానాముత్తమం వ్రత" మ్మని వ్రతములనుగూర్చి చెప్పినట్లు రమేశచంద్రుఁడు బరోడారాష్ట్రమునఁ గావించిన సంస్కరణముల నెన్నినప్పుడు ప్రతిదియు ముఖ్యముగా నెంచఁబడుచున్నది రయితులస్థితి వృద్ధికి తెచ్చుట, వాణిజ్యాభివృద్ధిఁ గావించుట, పరిశ్రమలపెంపొందచేయుట, పౌరులకు క్రొత్త హక్కులనిచ్చి పరిపాలనావిధాన మంతయు వారిచేతిలోనుండునట్లు "స్వరాజ్యపద్ధతి" నెలకొల్పుట వీనియం దేది యనావశ్యకమని తలంచుటకు రాజ్యపరిపాలనను శరీరముతోఁబోల్చవచ్చును కాళ్లు, చేతులు, ముక్కు, నోరు, కండ్లు, చెవులు, శిరము మెదడు మొదలగు నంగములు శరీరపోషణమునకు తోడుపడినట్లు, పరిపాలనలోని వివిధశాఖలు క్రమస్థితిలోనున్న యెడల పరిపాలనయు జయప్రదముగ జరుగుచుండును శరీరాంగములయం దేదిలోపించినను శరీర మెట్టికష్టములకు లోనగునో అట్లే పరిపాలనావిధానమునందలి శాఖలలో నేదివెనుకఁ బడియున్నను నది కుంటిగుఱ్ఱపునడకవలెను, ఒకకాలుతోడు గీర్చినట్టులును

ఉండను "సర్వస్వగాత్రస్య శిరం ప్రధాన" మనురీతిపరిపాలనా విధానమందు 'స్వరాజ్యపద్ధతి' యట్టిది పన్నులు తీసివేసినను, పరిశ్రమల వృద్ధికి తెచ్చినను ఇంకనెన్నియో సౌకర్యము లున్నను జనులకు పరిపాలనయందు తగినంత పలుకుబడి లేని యెడల నది శిరములేని సర్వాంగభూషితయగు శరీరమువంటిదే యగును శిరమునకు మెద కెంతముఖ్యమో అదిలేనియెడల సర్వాంగము లెంత విశాలముగ నుండునో వేరుగ వచింప నక్కరలేదు గదా? అట్లనే స్వరాజ్యశిరమునకు విద్య ముఖ్యము జనులు విద్యాభివృద్ధింబొంది జ్ఞానవంతు లయినం గాని స్వరాజ్యపదవిని నిర్వహింపంజాలరు మేము శరీరసామ్య ముతో నిర్వచించిన ఏ స్వరాజ్యపద్ధతికిని, విద్యకును గల యత్యంతసమీపసంబంధమును గ్రహించి నాగరిక సామ్రా జ్యము లన్నియు చాలకాలము క్రిందటనే నిర్బంధోచిత విద్యా పద్ధతిని ఆచరణలో పెట్టియున్నవి ప్రపంచమునం దిప్పుడు వానికిగల గౌరవమునకును, ఐశ్వర్యమునకును, ప్రధానకారణ మిదియే దేశములందు గుణమ్ము నెచ్చట నేది మంచిదియో దానినెల్ల గ్రహించుచుండిన శ్రీ సయాజిరావుగాయకవాడు బహాదూరు ఈ నిర్బంధోచిత విద్యాపద్ధతిని (Free and Compulsoıv educıtıon) తనరాష్ట్రమునందు నెలకొల్పం దలంచి మొట్టమొదలు నొక తాలూకాయందు ప్రారంభింపం జేసెను కాని దానిని పూర్తిగ రాష్ట్రమంతటను వ్యాపింపం జేసి క్రమమార్గమున నడిపించెడి బుద్ధికుశలతగల పురుషపుంగ వుసకై మిగతకార్యము నిలిచి యుండెను

1905-వ సంవత్సరమునందు యూరోపునుండి శ్రీ గాయక వాడు బహాదూరు విద్యాపద్ధతిని నిర్బంధోచితముగా రాష్ట్ర మంతటను వ్యాపకముజేయ నాజ్ఞాపించెను. అంతట రమేశ చంద్రుడు దానికితగిన యేర్పాటు లన్నియుచేసి ప్రతిగ్రామ మందును 'గ్రామ్యశాలలు' స్థాపించెను. రాష్ట్రములోని 7 సంవత్సరములు మొదలు 12 సంవత్సరముల వఱకు వయస్సుగల బాలురును, 7 సంవత్సరములు మొదలు 10 సంవత్సరముల వఱకు బాలికలును పాఠశాలకు వెళ్లవలె ననియు, అట్లు వెళ్లని యెడల సంరక్షకులు జరిమానాలకు పాత్రు లగుదు రనియు మొదలుగాగల నిబంధన లేర్పరచెను. విద్యార్థులకు వాచకము, లేఖనము, గణితము నేర్పబడును. ప్రతిగ్రామసంఘము క్రింద నొకగ్రామ్యశాల యుండవలె నను నేర్పాటుతో 2000 గ్రామసంఘము లేర్పాటుచేయబడెను. * ఇట్టి యుత్కృష్ట సంస్కరణ వలన బరోడారాష్ట్రము ఇతర సామంత రాష్ట్రములకే గాక ప్రధానదొరతనమువారికి గూడ మార్గదర్శక మయ్యెను. జనులు విద్యావంతు లగుచున్నప్పుడు రాష్ట్రము

* విద్యకై రివిన్యూలోనుండి నూఱు రూపాయలకు 6 8 0 లు బరోడాయందు వ్యయము చేయు చుండగా 1-2-8 లు బంగాళమందును, 1-7-0 లు బొంబాయియందును, 1 5 3 మద్రాసునందును, 1-0 0 ఇతర ప్రదేశము లందును బ్రిటిషుప్రభుత్వమువారు కర్చుచేయు చున్నారనియు, మనిషికి 0-7-0 ల చొప్పున బరోడాలో కర్చుపెట్టుచుండగా 0-1 0 మాత్రమే బ్రిటిషుప్రభుత్వము వారు కర్చుపెట్టు చున్నా రనియు రాష్ట్రపువార్షిక వృత్తాంతమందు రమేశచంద్రదత్తు వివరించియున్నాడు

దినదినాభివృద్ధిం గాంచుచున్న దనుట కేమి సందేహము ? ఇప్పుడు భరతఖండరాష్ట్రములందు నాయకమణిగా వెలుంగు చున్న దనిన నేమి యాశ్చర్యము ? నిరక్షరకుక్షులై దేశ మంతటను వెదచల్లఁబడియున్న మన బీదరైతులాదిగాఁగల జనమునకు బ్రిటిషుప్రభుత్వమువారు బరోడారాష్ట్రమునందు వలెనే విద్యాదాన మొసంగెదరుగాక !

బరోడాలోని సాంఘికజీవనము

రమేశచంద్రుఁడు బరోడాలోనున్న కాలమందు తానును తనకుటుంబ స్త్రీలును సాంఘికోత్సవములందు చొరఁబడి ఇతరులతో కలిసి వానిని మరంత ఆనందమయ మొనర్చు చుండిరి రమేశచంద్రునియింట విందు లెప్పుడును జరుగు చుండెను అప్పుడప్పటి మరాటి, గుజరాతి, బెంగాలి, పార్సి, మహమ్మదీయాది సంఘముల స్త్రీలిచ్చి విచ్చేసి యాతని దివ్యభవనోపరితలమున నాశరత్కాల చంద్రికలయందు తమ పాటలచేతను, ఆటలచేతను, ముచ్చటల చేతను, అచ్చనల చేతను రమేశచంద్రుని సంతోషాంబుధ నోలలాడించు చుండరి ఈ విందు లొక్కొక్కసారి రాత్రి 12 గంటలవఱకుగూడ నుండు చుండెను బాలురకు బాలుఁడుగను, పడుచువారలకు పడుచు వాఁడుగను ఉండి వారితో గంతులువైచుచు, నా సమావేశ ములచే భరతఖండములోని వివిధశాఖలవారి నేకము చేయఁ బూనిన నీ మహనీయుని బుద్ధివైశద్య మసమానముగదా ? ఇతరసంఘముల స్త్రీ లందఱును నీతని 'బాబుదివా ౯' అను చుండిరి వీరినాతఁడు క్షీనష్లింపుడు కుమార్తె లనియు, మనుమ

రాంద్రడనియు పిలుచుచుండెను. అచ్చట స్త్రీలసమాజమునొకటి స్థాపించి వారి పురోవృద్ధికై ఎంతయో పాటుపడెను. బాలికలకు జరీకుట్టు నేర్పు నొక పాఠశాలను స్థాపించెను. గొప్పగొప్ప కుటుంబములవారు తమపిల్లల నచ్చటికిపంపినతమకు గౌరవ హానియని తలంచి పంపకుండిరి. కాని రమేశచంద్రుండీసంగతిని తెలిసికొని అప్పు డచ్చటనేయున్న తనపెద్దకూతురిబిడ్డల నాబడికి ముందుపంపించి మార్గదర్శకుండయ్యెను. అంతగొప్ప వారందఱు తమతమ పిల్లలను పంపించి యీ పాఠశాల నెంతోవృద్ధి చేసిరి!

విశాలహృదయుండగుటచేతను, కరుణారసపూరితుం డగుట చేతను రమేశచంద్రుని బరోడాజను లధికముగం బ్రేమించు చుండిరి. క్రిందియుద్యోగస్థు లగు గుమాస్తాలు చేయుపనిని మెచ్చుకొనుచు వారికనుత్సాహము కలిగించు చుండెను. ఎవరు వెళ్లి తమ కష్టముల చెప్పుకొనినను వారిని నిరాదరణ చేయకవిని వారికితగినంత సహాయ మొనర్చుచుండుటచే ఎట్టి బీదవారును నాతని దర్శించుటకు జంకకుండిరి. ఇట్లు బరోడాలోనున్న కాల మందు జనానురాగమువడసి 'దరిద్రకాదోస్తు' (దరిద్రుల స్నేహితుండు) అను పౌరుషనామమును బొందెను.

ఇట్లు రమేచంద్రుండు 1904 మొదలుకొని 1907 వఱకు బరోడాలోని ప్రభువుయొక్కయు, ప్రజలయొక్కయు హితము కొఱకు పాటుపడి 1907 సంవత్సరము జులై నెలలో నా యుద్యోగమును వదిలి విశ్రాంతికై కిలకత్తాచేరెను. తా మెంతో ప్రేమించిన పురుష పుంగవుం డింకన్ను తము మధ్య నుండ పోవు

సంస్థానములకు రాష్ట్రీయములోని యారోగ్యాలయోపాలము వింతించి చనిన చేసి యాశ్చర్యము? మానవుని యునికయొక్క సాఫల్యత యింతకన్నె వేరుగ గలదా?

## అధికారవిభజనసభ

ఈ కాలము సెలవుఁగైకొని స్వాంతముగా కాలమును గడుప బోవనెంచె. అయ్యది నెరవేరెను గాని యతనియుద్దేశము సరియైనది కాంపోయెను. మిత్రులగు బహుజనాలును ప్రీతితో హైముల్లాలా యందుకు కాలము పుచ్చుచుండ గా క్రొత్తగ నేర్పాటైన అధికార విభజనసభ (Decentralisation Commission) యందు రమేశచంద్రదత్తొక సభ్యుడుగా నియమింపఁబడినట్లు పత్రికల యందు ప్రకటింపఁబడెను. దక్షిణాపథమునందియు మహారా వచనములకై యదివఱకే నిశ్చయించుకొని యుండినందున వెంటనే యయ్యది నెరవేరిచి మైసూరు, కొచ్చిన్, తిరువాన్కూరు రాష్ట్రీయములను సందర్శించి అచ్చటి ప్రభువులచేతను, అధికారులచేతను మన్ననలనుగొనుచు రామేశ్వరము వఱకు వెళ్లెను. తిరుచినాపల్లి, మదుర, తంజావూరు, కుంభకోణము మొదలగు పట్టణములందు నాతని యుపన్యాసములను విను నవకాశ మనేక జనులకబ్బెను. మద్రాసు పచ్చయప్ప కాలేజి భవనమున హిందూదేశ చరిత్రాధ్యయనమును గూర్చి యాతఁడిచ్చిన గొప్ప యుపన్యాసమును వినుటకై వేలకొలఁది జనముగూడిరి. తరువాత శీఘ్రముగా బొంబాయినగరమునకు వెళ్లి 1907 సం॥ నవంబరు నెలలో తన సభ్యులను కలిసికొనెను.

ఈ సభవారు బొంబాయినుండి మద్రాసునకువచ్చి పనిప్రారంభించిరి మద్రాసునుండి బర్మాకును, అచ్చటినుండి బంగాళమునకును, తరువాత మధ్యపరగణాలకును, పిమ్మట యునైటెడ్ పరగణాలకును వెళ్లిరి కొంత విశ్రాంతియును పొందిన తరువాత బొంబాయి, సిందు, బెలూచిస్థానము, వాయవ్యసరిహద్దు పరగణాలయందు తిరిగితిరిగి సిమ్లా, పంజాబులతో తమపని ముగించిరి వెళ్లినచోట్ల నెల్లను అధికారులనుండియు, అనధికారులనుండియు వాఙ్మూలములు గైకొని చర్చించి, ఆలోచించి, రిపోర్టువ్రాయుటకై 1908 ఏప్రిల్‌లో ఇంగ్లండునకు పయనమయ్యిరి

ఈ సభవారు హిందూదేశమునకు లాభకరముగ నుండు మార్పుల ననేకములు సూచించుటయేగాక, అభిప్రాయభేదములగు కొన్నింటిగూడ పేర్కొనిరి లాభకరముగ నుండువాని విషయములో రమేశచంద్రదత్తు ఆసభ్యులతో సంపూర్ణముగా నేకీభవించెను, అభిప్రాయభేదకములగు విషయములలో ఎక్కువ సంఖ్యగలవారు ఏకాభిప్రాయులైయుండినను తానువ్యతిరేకించి తన యసమ్మతిని కారణములతో దెలిపెను హిందూదేశ రాజ్యాంగవిమర్శనార్థమైపుట్టిన ఇట్టి సభయందు పెక్కురు హిందువుల నుంచుటకు బదులు ఒక్కనే నియమింపబడుట విచారకరమే యయినను, అతడు హిందువుల యభిప్రాయములను సమర్థతతో తెలిపి వాదింపగల రమేశచంద్రదత్తు అగుట సంతసకరమైన విషయముగదా?

## లార్డుమోర్లి సంస్కరణములు

అధికారవిభజనసభ రిపోర్టురచనార్థమై రమేశచంద్రదత్తు లండనులోనుండిన కాలమందుననే మోర్లిప్రభువు హిందూ దేశ రాజ్యాంగమునందు కొన్ని సంస్కరణములు చేయ తల పెట్టెను. మోర్లిప్రభువు హిందూదేశ విషయములను గ్రహించుటకై సద్వృత్తాంతమును తెలుపు హిందువులతోను, ఇంగ్లీషు వారితోను సంప్రతించు స్వభావము కలవాఁడగుటచే రమేశ చంద్రునియునికి యాతనికెక్కు డుపయోగకారి యయ్యెను. అనేకసంవత్సరములనుండి పరిచయముగల లార్డుకోర్టినె, లార్డు మెక్డొనెల్లుమొదలగు పార్లమెంటుప్రముఖులను సందర్శించెను. వీరితో సంస్కరణములను గురించి మిక్కిలిగ చర్చించెను. హిందూదేశ విషయములలో ఉత్సాహముగొని పనిచేయు అనేకులతో కలిసి ప్రవర్తించెను.

సంస్కరణములు చివరకు ప్రకటింపఁబడెను. ప్రతినిధిత్వము నందు హిందువులను, మహమ్మదీయులను వేరుచేయుట తప్పు మొత్తముమీఁద జనసమ్మతమును వడసెను. రాజప్రతినిధి గారి కార్యాలోచనసభ యందు సభ్యుఁడుగా రమేశచంద్రుఁ డేర్పాటు కాఁబడునని యొక కింవదంతి పుట్టెనుగాని యది నిజముకాక పోయెను.

## అంత్యదినములు

1909 సంవత్సరము మార్చి నెలలో రమేశచంద్రుడు హిందూదేశమునకు వచ్చెను. కొంత విశ్రాంతినిగైకొని పిమ్మట

బరోడారాష్ట్రమున ప్రధానమంత్రిగా ప్రవేశించెను (1-6-09) తామెంతో ప్రేమించిన రమేశచంద్రుడు తిరిగివచ్చి పరిపాలనను స్వీకరించె నని బరోడాజను లుత్సాహపూరితులైరి

ప్రధానమంత్రి వేతనము 4000 రూపాయలవఱకు హెచ్చింపఁబడెను రమేశచంద్రుఁడు మొట్టమొదలా యుద్యోగము నందు ప్రవేశించునప్పుడు ఒక సంవత్సరముకంటె నెక్కు డుండఁదలంపలేదు 1911-వ సంవత్సరము సేనవికాలములో ఆయుద్యోగమునువీడి ఆరోగ్యకరముగా నుండు ట్యాంకురా యందు స్వగృహమున నివసించి, తన మిగతజీవితకాలమును విద్యాగోష్ఠియందు వినియోగింప ఆతని యభిప్రాయమయి యుండెను తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచునుగదా ?

బరోడాలో ఉద్యోగమునందు ప్రవేశించి నప్పుడు రమేశచంద్ర దత్తు ఆరోగ్యము గన్లే యుండెను అప్పు డతనిని చూచినవా రందఱు ఎప్పుడితఁడంత సౌఖ్యముగ నుండలే దని చెప్పియుండిరి 1906-వ సంవత్సరముననే యతనిక గుండెయందు నొప్పికలుగఁగా ఇఁక పనిచేయ వద్దని వైద్యు లతనికి సలహా నిచ్చిరి ఆరోగ్యముకొఱకు ఇంగ్లండునకు వెళ్లి యుండినను అది సంపూర్తిగ నిమ్మళింపలేదు అతఁడు కష్టపడి పనిచేసి నప్పుడెల్ల నది ప్రత్యక్ష మగుచుండె నని యతఁడు చెప్పు చుండెను 1907-1908 సంవత్సరముల యందు చాలవిశ్రాంతిని పొంది నందున యట్టి బాధ సంభవించి యుండలేదు బరోడాయందు దివానుపదవిని స్వీకరించి నప్పుడును వైద్యులుపరిక్షించి ఆతని హృదయము మంచిస్థితిలో నుండె నని చెప్పియుండిరి

కాని లార్డు మింటో, లేడీ మింటో గార్లు బరోడా సందర్శనము నందలి సమయమున (15-11-1909) మేధస్సునకును, హృదయమునకును ఎక్కువశ్రమ కలిగెను. ఆ రాజప్రతినిధి కిచ్చిన విందునాటి రాత్రి సమస్తము నేర్పాటు చేయుటయు, అతిథుల మర్యాద చేయుటయు, మొదలగు పనుల యందు నితఁ డెక్కువ కష్టపడవలసి వచ్చెను. అప్పుడే ఎప్పటి బాధ యారంభమాయెను. కాని అతఁడు ఎందెచ్చట విఘ్నమగునోయని బాధనంతయు నోర్చుకొని ఆ గొప్పవారలకు సన్మాన మొసఁగెను. నాఁటినుండియు మంచమెక్కెను. వ్యాధియంతకంతకు తీవ్రముగా పరిణమించెను. హృదయము నందు నొప్పి యెక్కుడయ్యెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములకు వీలులేకపోయెను. మహారాజాయును, మహారాణీయును, ప్రజలును దోలాందోళితమానసులై గంట గంటకునాతనిస్థితిని తెలిసికొనుచుండిరి. కాని గొప్పగొప్ప డాక్టర్ల తెలివియు, సతీతిలకము యొక్కయు, కూఁతురి యొక్కయు ఉపచారములును పౌరులప్రార్థనలును నిరుపయోగములయి ఆ మహాపురుషుని యాత్మ 1909-వ సంవత్సరము నవంబరు 30-వ తేదిరాత్రి రెండు గంటలవేళ శాంతధామమును జేరెను!

రమేశచంద్రుఁడు తన యవసాన దశకు పూర్వము దేశభక్త బాబు సురేంద్రనాథబనర్జి కిటుల వ్రాసెను —

“ఒక్కతరముకాలము నందు ఎట్టిచిత్రమగు పరివర్తనమును మనము చూడఁగలిగితిమి? ఒకజాతియొక్క యూహాలయందును అభిప్రాయములందును ఎట్టి మార్పుకలిగెను! ఆ మార్పును కలుగచేయుటలో నీ వెంత చక్కఁగ విధికృత్యమును నెరవేర్చియుంటివి! మనతోకలిసి పనిచేసిన

స్నేహితు లంకాషైర్కొర్కై యప్రశ్య ఁగుచున్నారు ఎగ్గుతించెను! దాంపరోహాణ్ తించగ! రాన్ మోహాణ్ గతించెను! సాయుగ నా కాలములోనె గతించెదము! కాని నీయంటె తక్కువకాని ధనంతులున సత్యాగ్రహులును, వృద్ధ ప్రతిజ్ఞులును, దేశబాంధవులును అయిన గోఖలే మహా పూరితులగు కార్యశూరుల నామములతో 19-వ శతాబ్దము యొక్కయు 20 దవ శతాబ్దపు ప్రాథమికభాగము యొక్కయు హిందూదేశ చరిత్ర విరాజిలుచుండును!"

రమేశచంద్రునియందు తనకుగల గురుభావము తేటపడ రాజవంశికులకై యీ నిర్దేశింపఁబడియుండిన విశ్వామిత్ర నది తీరమందలి కేదారేశ్వర మందు ఆతని దహనసంస్కారములం జరుప శ్రీ సయాజీరావు బహదూరుగారి ఆజ్ఞ యొసఁగగాను శవము ఒకపల్లకియం దుంపఁబడి వెనుకముందు సేనలు నడుచుచుండ గొప్పవారలు కొద్దివారలు అను భేదము లేకుండ ఆబాలగోపాలము వెంటనరుగ గొప్ప మహోత్సవముతో శ్మశానవాటికకు గొంపోఁబడెను గరీబుకాదోస్తు యొక్క కాయమున కగ్నిముట్టింప సమస్తజాతియులును— హిందువులు, మహమ్మదీయులు, పారశీయులు-తమ భ్రాతృవర్యుని కడసారివీక్షించి తలలువంచి యాతనికి శాశ్వతస్వర్గసౌఖ్యమును ప్రసాదింప పరమేశ్వరుని గోరుచు నిట్టూర్పుపుచ్చిరి

ఈదుర్వార్త యప్పుడు దావానలమువలె ప్రపంచమంతటను వ్యాపించెను ఇంగ్లండు, ఇండియాలోని పత్రికలును, ప్రజాసంఘములును, గొప్పగొప్ప ఉద్యోగస్థులును రమేశచంద్రుని మరణమునకై వగచిరి రాజప్రతినిధి యగు లార్డుమింటో

గారును, బొంబాయి గవర్నరగు సర్ జార్జిక్లార్కు గారును, బంగాళపు లెప్టనెంటు గవర్నరగు సర్ ఎడ్వర్డు బేకరు గారును, ఇండియా దొరతనమువారి విదేశాంగ మంత్రియు, మొదలగు ఉద్యోగులు అందఱును తమ సానుభూతిని, పరితాపమును దెలిపిరి శ్రీ సయాజిరావు గాయకవాడు తనకుడి భుజమే పోయినట్లు విలపించెను రవీంద్రనాథటాగూరు, సోదరి నివేదిత మొదలగు కవిగ్రామణులును, భక్తాగ్రేసరులును చింతించిరి హిందువులు, మహమ్మదీయులు పారసీయులు క్రైస్తవులు తమభేదమును పోనాడి బంగాళములోని పట్టణములందును మూరుమూలలనోనున్న గ్రామములందును, బొంబాయి, పంజాబు, మొదలగు పరగణాలయందును, మన ఆంధ్రదేశమునందును సభ లనేకములుజరిపి తమ ఖేదమును దెలిపిరి ఇట్టి సభలే లండను నందును, క్యాంబ్రిడ్జియందును జరిగెను వీరు పగచిరి వారుచింతించిరి యని పొల్లుపదములతో నెంతదూరము వ్రాయఁగలము ? ఎంత మందిని పేర్కొనగలము ? అది యసాధ్యము సమస్త తారాగణమధ్యమున ప్రకాశించుచుండు తేజోరాశియకస్మాత్తుగ నదృశ్యమయి ఆకాశమంతయు మేఘాచ్ఛాదితముకాఁగా కాఱుచీఁకటులు నలుదెసలగ్రమ్మ జనులందఱు శోకసముద్రములో మునింగి రనిన సత్యమునకు కొంతదగ్గఱగానుండునేమో ?

## కుటుంబము

రమేశచంద్రునకు ఒకకొమారుఁడును కమల, విమల, అమల, సరళ, సుశీల అను నైదురు కొమార్తెలును కలిగిరి వీరం

నలు విద్యాపారీణులును, జ్ఞానవంతులును అయి తమ ప్రేమచే రమేశచంద్రుని ధన్యునిగావించిరి. రమేశచంద్రున కీ కుమార్తెలయందుఁగల ప్రేమ అసమానము. తాను రచించిన గ్రంథములన్నియు నీయువతిరత్నములకు అంకితముచేసెను. బాల్యసంతానము అందఱు జీవితులై యుండినందున రమేశచంద్రుఁడు బ్రతికినంతకాలము మనఃకష్టమెట్టిదియో యెఱుంగక ఆనందవారిధిం దేలియాడుచుండెను.

## గ్రంథరచన

'భాషాసేవయే ఆద్యకర్తవ్యము, లక్ష్మీసేవ ద్వితీయము' అని రమేశచంద్రుఁడు పలుమారులు తనయభిప్రాయమును జాటియున్నాఁడు. అత్తగారికి కోడలియందుగల సహజమైన యసూయవలె లక్ష్మీదేవి యీతని తనసేవయందె యుంచుకొనఁ బలఁజేసికొనినను ఆమె కొంతవఱకు మాత్రమే ఫలితమనోరథురా లయినటు లొకచోట వ్రాసియున్నాఁడు. భాషాసేవయం దితనికింత యభిరుచియుండుటచే చిన్నతనమునుండియు, పత్రికలకు వ్యాసములు మొదలగునవి వ్రాసి కొంతపునాది ఏర్పఱుచుకొనెను. రమేశచంద్రుఁడు తన చిన్నతనమందు వ్రాసినవ్యాసములు రాజకీయ, సాంఘిక, ఆర్థిక, పరిశ్రామికాది విషయములను గూర్చి విశేషముగా నుండెను. ఇతనివ్యాసముల యోగ్యత అప్పుడే యెక్కువగా ప్రశంసింపఁబడెను.

ఉద్యోగనిర్వాహణమునం దతఁడు మగ్నుఁడై యుండినను ఆప్రథమదినములలో నాతని లేఖిని సోమరిగా నుండలేదు. 1872-వ సంవత్సరములో (1) 'యూరోపు వత్సరత్రయము'

(The three years in Europe), 1875-వ సంవత్సరములో (2) 'వంగదేశపురయితులు' (The Peasantry of Bengal), 1877-వ సంవత్సరములో (3) 'బంగాళావాఙ్మయము' (The literature of Bengal) అను నీమూఁడు చిన్నపుస్తకములను ఇంగ్లిషుభాషలో మొట్టమొదట రచించెను కాని 'గ్రంథకర్త' యనుఖ్యాతి ఆతఁడు బంగాలీభాషలో రచించిన నవలలతో ప్రారంభమయ్యెను

19-వ శతాబ్దమునందు గొప్పబంగాలీ లేఖకుఁ డని ప్రసిద్ధి చెందిన బంకించంద్రచటర్జి రమేశచంద్రుని తండ్రికిస్నేహితుఁడు రమేశచంద్రుఁడును చిన్నతనమునుండియె బంకించంద్రునియందు భక్తిగౌరవములుకలిగి యాతని మైత్రి సంపాదించెను ఇంగ్లండునుండి వచ్చిన తరువాత రమేశచంద్రుఁడు బంకించంద్రుని కలిసికొని యాతనితో తాను చేయఁదలఁచుకొనిన భాషాసేవనుగూర్చి ముచ్చటించినప్పుడు బంగాలీభాషలో గ్రంథరచనచేయు మని బంకించంద్రుఁడు రమేశచంద్రుని పురికొల్పెను "ఏమి? బంగాలీభాషలో వ్రాయుటయా? నాకు బంగాలీలో సుశైలిని వ్రాయుటకు తెలియదే?" అని రమేశచంద్రుఁ డు తనవిస్మయమును తెలిపెను 'ఇట్టిచింతయేల? నీ బోటి ధీమంతుఁడు వ్రాయునదెల్ల సుశైలి యనిపించుకొనక మానదు నీయందట్టి శక్తి గర్భితమైయున్న యెడల సుశైలి తనంత టదియేవచ్చును' అని బంకించంద్రుఁడు ఆతని సందియమును మాన్పెను ఈసంభాషణ జరిగిననాఁటనుండి రమేశచంద్రునిదృష్టి మాతృభాషపైమరలెను

'దుర్గేశనందిని' 'వంగవిజేత' 'మాధవీకంకణము'* 'మహారాష్ట్రజీవనప్రభాతము (Rise of the Maharashtra Confederacy) అను నీ నాల్గుచరిత్ర విషయకనవలలను అతఁడు మొట్టమొదట బంగాలిభాషలో వ్రాసెను. రమారమి 100 సంవత్సరముల చరిత్ర అనఁగా 16-వ శతాబ్దపు మధ్యకాలము నుండి ఔరంగజేబు ప్రభుత్వమువఱకుఁగల చరిత్రవిషయముల నతిమనోహరమగు రీతిని యీనవలలయందుఁ జొప్పించెను. ఈనాలుగు గ్రంథములు 1874-1880 మధ్యకాలములో రచింపఁబడెను.

తరువాత చరిత్రసంబంధమగు నవలలను వదలి సాంఘిక నవలలపై యాతనిదృష్టి మరలెను. 1885-వ సంవత్సరములో పర్లో సెలవు మీఁద నుండినప్పుడు 'సంసార్' (సంసారము) † అను

* మాధవీకంకణమును రమేశచంద్రుఁడు తరువాత 'ఆగ్రానగరబానిససుందరి' (The Slave girl of Agra) అను పేరుతో నింగ్లీషు భాషలో వ్రాసెను. దీనిని శ్రీయుత తిల్లాప్రగడ సూర్యనారాయణ రావుపంతులుగారు ఆంధ్రములోనికి చక్కనిశైలిని పరివర్తనముచేసి యున్నారు. తెలుఁగులో దీనికి 'మాధవీకంకణము' అనియె పేరు.

† 'సంసార్' అను గానిని రమేశచంద్రుఁడు 'తాటిచెట్ల తటాకము' ("The lake of Palms") అను పేరుతో ఇంగ్లీషులోనికి భాషాంతరముచేసెను. దీనినే శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 'సుధాశరచ్చంద్రము' అని నామకరణముచేసి బహురమ్యముగ తెనుఁగులోనికి అసంపూర్తిగ పరివర్తనముచేసి 'మనోరమ'లో ప్రకటించి యున్నారు. దీనినే 'ప్రేమ సాగరము' అను పేరుతో నాళము కృష్ణరావుగారు అనువాదించి మానవసేవయందు ప్రకటించుచున్నారు. వీనిని త్వరలోముగించిన యెడల ఎంతో మేలుగ నుండునని నీ గ్రంథకర్తలకు సవినయము విజ్ఞాపించుకొనుచున్నాను.

నదియు, 1893 లో 'సమాజ్' (సమాజము) అనునదియు రచించెను ఈ రెంటి యందును బంగాళములోని ప్రతిదిన పత్రము వర్ణింపఁబడిన 'సంసార్' అను దానియందు స్త్రీ పునర్వివాహమును గూర్చియు, 'సమాజ్' అనుదానియందు వర్ణాంతరవివాహములను గూర్చియు, అనుకూలముగ వ్రాయఁబడెను

పాత్రౌచిత్యము, రసపోషణము, కథాచమత్కృతి, చరిత్రాంశముల నేమి, సాంఘికాచారముల నేమి, మతాభిప్రాయముల నేమి, నీతిసూక్తుల నేమి సమగ్రితతో కథలలోనికమార్చి చదువరులకు హృదయంగమముగ నుండ నట్లు జేయు నేర్పరితనమునిని వెల్లడిచేయుటయందు రమేశచంద్రుఁడు బంకించంద్ర చట్టోపాధ్యాయుని మించినవాఁడు కాకపోయినను తక్కువవాఁడనుటకు ఎంతమాత్రమును అవకాశము లేదని పండితు లేక గ్రీవముగాఁ జెప్పియుండుటయే రమేశచంద్రుని రచనాకుశలతను వేనోళ్ల జాటుచున్నది ఇంతియెగాను ఈనవలలయందింకొక విశేషముగలదు వీనియందువర్ణింపఁబడిన స్త్రీపురుష పాత్రములన్నియు,మనోజ్ఞములును,ఉత్తమములును,శాంతశమదమాది సద్గుణగరిష్ఠములును అయి చదువువారియొక్కయు, వినువారియొక్కయు మనములనుల్లాసములో తేల్చుచుండునట్లు మించిబోధించుటకై చెడు విషయములను నెక్కడనునీతఁడు వర్ణించియుండలేదు ఈ విషయమును ఆంధ్రనవలాకారులు గమనించవలె నని మా కోరిక

బంగాళీభాషలో నితఁడు వ్రాసిన నివి యన్నియు కొంచె మెచ్చుతగ్గుగ చిన్నపుస్తకములు, స్వకపోలకల్పితములు, ఐహికసంబంధములు కావున మనపూర్వుల పారమార్థిక జ్ఞానమును వెల్లడిచేయుటకై రమేశచంద్రుఁడు కృషిచేసినదియు అతఁడెట్టి కార్యమును నిర్వహించినదియు ముందుముందు తెలిసికొనఁగలము

## ఋగ్వేదభాషాంతరీకరణము

ఏదైననేకజాతి హీనస్థితిలోనుండి వచ్చినప్పుడు ఆజాతిసంతానము తమపూర్వికులు గణనీయమైన మహాత్మ్యపూర్ణ కార్యములను స్మరించుచు అభ్యుదయ కాంక్షింపగాని యాజాతి తిరిగి యుచ్ఛస్థానము నధిష్ఠించదని రమేశచంద్రుఁడు మనఃపూర్తిగ నమ్మియుండెను ఋగ్వేదములోని ఋక్కులును గీతములును అద్వైతమతమును ప్రపంచపర్యాలోచనస్థితిని, పగనూత్నవి చాకచక్యమును బోధించుటయేగాక పూర్వహిందువులు పరమాత్మజ్ఞానాభివృద్ధియందు ఎట్టియున్నతస్థానము నాక్రమించి యున్నదియు వివరించుచుండెను

పెట్టెలోఁ బెట్టితాళమువేయఁబడి జనముచదువుటకు వీలు లేకుండనుండిన యీపారమార్థిక జ్ఞానభాండారమును బంగాలీలోనికి భాషాంతరముచేసి యందఱకును వశమగునటులు చేయుట అవశ్యకర్తవ్యమని రమేశచంద్రుఁడు దలంచెను హిందూమతిమునకు మూలమైన ఈ పవిత్రగ్రంథమును రమేశచంద్రుని వంటి బ్రాహ్మణేతరుఁడు చదువుటయే గాక

బంగాళిలోనికి భాషాంతరము చేయుచున్నాఁడని పూర్వా చార పరాయణబృంద మొక్క పెట్టిన గోల పెట్టెను ఇట్టికల్లోలము పూజనీయు విద్యాసాగరులు స్త్రీపునర్వివాహమును బోధించి నప్పుడైనను బహుభార్యాత్వమును నిషేధించి నప్పుడైనను బంగాళీయులలో జరిగియుండ లేదు. రమేశ చంద్రుఁడు వీనినన్నిటిని సరకుసేయక మెల్లగ పనిచేసి 1885 వ సంవత్సరము ముగియకమునుపే కొంతమంది పండితుల సహాయమున మొదటిసంపుటము బయలువెడల్చి పూర్వాచార పరాయణుల మరింతవిస్మితుల గావించెను

ఇతని భాషాంతరమును నిందించిరి ఈ నిందలును, పత్రికల యందు జరుగు వాదప్రతివాదములును కారణములుగ నీగ్రంథమునకై చందాదారులసంఖ్య యెక్కువగుచుండెను 1886-వ సంవత్సరమున యూరోపునకు వెళ్లుటకు పూర్వమే ఋగ్వేదమంతయు భాషాంతరము చేయఁబడి అచ్చువేసి వేయఁబడెను బంగాలీ భాషలోనికి సంపూర్తిగ పరివర్తనము చేయబడిన ఋగ్వేద మంత్రముల గ్రంథ మిదియొక్కటియే పండిత మాక్సుమ్యుల్లరు మొదలుగాఁగల విద్వాంసులు ఈగ్రంథమునెంతయు మెచ్చుకొనుచు ఉత్తరములు వ్రాసియుండిరి దొరతనమువారు ఈగ్రంథమునకు ముద్రాభృతికై కొంత ద్రవ్యసహాయము జేసి తము భాషాపోషకత్వమును ధృవపరిచిరి

## ప్రాచీన హైందవ సభ్యత

ఋగ్వేదమును భాషాంతరము చేయుచుండినప్పుడు సంస్కృతసాహిత్యమును బట్టియిూ ఇంగ్లీషు వారుచేసిన పరిశోధనలను

బట్టియు హిందూదేశపు పూర్వచరిత్ర వ్రాయవలెనని రమేశ చంద్రునకు దోచెను ఈ విషయము మీఁద అప్పుడప్పుడు కొన్ని వ్యాసములు పత్రికలలో ప్రచురించెను గాని తరువాత నీ పని కడవఱకు సాధింప పూనుకొనెను

అప్పుడు రమేశచంద్రుఁడు మైమన్‌సింగుజిల్లాయం దుం డెను అచ్చట తగినపుస్తకభాండాగారము లేనందున కలకత్తా నుండి పుస్తకము లనేకములు కట్టలు కట్టలుగ తెప్పింపఁబడెను రమేశచంద్రుఁడు దవురావెళ్ళినప్పు డతనిపడకగది యంతయు వ్రాతప్రతులతోను గ్రంథములతోను అచ్చుచిత్తులతోను నిండుచుండెను పగటిపూట యందు ఎంత మాత్రము విరామము లేక పోవుటచే రాత్రి భోజనానంతరము నడిరాత్రివఱకు ను పనిచేయుచుండెడివాఁడు ఒక్కొకనాఁడి యతనికి తెలియ కుండనే తెల్లవారుచుండెను ఇట్లు ఎక్కుడగా పని చేసియుండుట చాలకష్టకరమే ! అపాయకరమే ! కాని తనదేశపుచరిత్ర వ్రాయవలయునను ఇచ్ఛ, నిశ్చయము అతని నిట్టి కష్టమునకు పాల్పఱిచెను చివరకు 1888-1890వ సంవత్సరముల మధ్యకాల ములో ఆగ్రంథము ముగింపఁబడి మూఁడుసంపుటములుగా ప్రచు రింపఁబడెను దీనికి 'ప్రాచీన హైందవ సభ్యత' (Civili-zation in ancient India) యని నామకరణము చేసెను ఇంగ్లిషు భాషలో విపులముగను సమగ్రముగను రచింపఁబడిన హిందూదేశచరిత్ర మిదియొక్కటియే ఇది యనేక సారులు ముద్రింపఁబడి జనసమ్మతము నెక్కువగాఁ బడసియున్నది

రామాయణ మహాభారతములు

సంస్కృత వాఙ్మయపరిన మతిని యెక్కువ ప్రియుఁడై యుండెను చదువనుచదువన జ్ఞానభాండారములును గొప్పఇతిహాస గ్రంథములును అగు భారత రామాయణములను ఇంగ్లీషు పద్యములలోనికి భాషాంతరము చేసిన బాగుండు నని యాతఁడు దలఁచెను ఇదిగొప్పసాహసమేగదా? అయిన ఆగ్రంథములలోని దంతయు భాషాంతరము చేయుటగాక అందలిముఖ్యకథలం గైకొనివానిని భాషాంతరముచేసి మధ్యమధ్య చిన్న చిన్న పరాలతో కథాసందర్భమునుగలుపను ద్దేశించెను తనకావ్యమునకు కావలసిన వృత్తములకై ఇంగ్లీషు వృత్తముల నన్నిటిని పరిశోధించి తుదకు సంస్కృతము లోని అనుష్టుప్ ఛందస్సును పూర్ణముగా బోలియుండునొక ఇంగ్లీషువృత్తముతో తనకావ్యమును నిర్మించకడంగెను అతఁడాపనియందు కొంతయభివృద్ధి జరిపిన తరువాత తానుచేయుకార్యమునుగూర్చి పండిత మాక్సుముల్లరునకు వ్రాసెను ఆ యాక్సుఫర్డు విద్వాంసుఁడా కార్యము చాలముఖ్యమైన దనియు తొంబదివేలగ్రంథ మగు మహాభారతమును చదువుట కనువగునటు కొద్దిలో వ్రాయుటకు వీలేలేదనియు రమెశచంద్రునకు ప్రత్యుత్తరము వ్రాసెను కాని రమేశచంద్రుఁడు దృఢప్రజ్ఞుఁడగుటచే నెమ్మదిగా పనిచేసి మహాభారతమును ముగించఁగనే నొకప్రతిని మాక్సుముల్లరుకు పంపెను ఆ విద్వాంసుఁడు మహదాశ్చర్యమును అమందానందమును బొందినవాఁడై ఆగ్రంథమునకు ఉపోద్ఘాతమును వ్రాయుటకు ఇయ్యకొనెను

1898వ సంవత్సరము ఆగష్టు నెలలో మహాభారతము వెలువడెను, అనంతర మొక సంవత్సరమునకు ఆతని 'రామాయణము' ప్రకటింపబడెను. ఈ రెండు ఇతిహాసములను గురించి విషయ విమర్శనము చేయుచు రమేశచంద్రుడు వ్రాసిన వ్యాసములతో పీఠికలు చరిత్రాధ్యయనపరు లందఱును చదువదగియున్నవి

కొలది కాలములో భారతముయొక్క 15,000 ప్రతులును, రామాయణముయొక్క 10,000 ప్రతులును అమ్ముడుపోయెను అనేకవిద్వాంసులు - ఆంగ్లేయులు, హిందువులు - రమేశచంద్రుని యింగ్లీషుసాహితీ పటిమను, పద్యరచనా కౌశల్యమును, నిష్కృష్టశైలిని వేనోళ్లబొగడియున్నారు అత్యంత రమణీయమగు ప్రతియొక్కటి శ్రీవిక్టోరియాచక్రవర్తినిగారికి పంపగా నాయమ మిగుల సంతసించి వందనములతో స్వీకరించెను

## హిందూదేశ ఆర్థికచరిత్ర *

## (Economic History of British India)

భూమిశిస్తులనుగురించి కర్జనుప్రభువుతో వాదప్రతివాదములు జరిగిననాటినుండి రమేశచంద్రుడు ఆర్థికవిషయ విమర్శనము చేయదొడంగెను అందుకై హిందూదేశములో మొట్టమొదలు బ్రిటిషుపాలనారంభమునుండి వివరముకలిగియున్న

* దీని కొంతవఱకు శ్రీ డి సూర్యనారాయణరావు గారు తెలుగులోనికి మార్చియున్నారు

శాసనలిఖిత గ్రంథము (Blue Books) లను సేకరించెను అవిదాదాపుగా రెండువందలకు పైగానుండెను ఏనినిశాగుగ పఠించి హిందూదేశపు భూమిశిస్తులను గూర్చియు, పరిశ్రమలను గురించియు, ఆర్థికోదంతములనుగూర్చియు, వి యములు అవ గాహనచేసుకొనెను అంతా ప్లాసీయుద్ధ ము నాటినుండి (1757) ఇరువదవ శతాబ్దోదయము వఱకు హిందూదేశపు ఆర్థికచరి త్రను తెలుపు గొప్ప గ్రంథము రచించెను ఇదిరెండు సంపు టములుగా ప్రకటింపబడెను మొదటిది 1902 లోను, రెండ వది 1904 లోను వెలువడెను రమేశచంద్రుని యోపిక, పరి శ్రమ, సాంగత్యజ్ఞానముయొక్క సుఫలితమిదియె ఇందు పరి శ్రమలనుగూర్చియు, వర్తకమును గూర్చియు, చేతిపనులను గూర్చియు విరివిగచర్చింపబడెను భూమిశిస్తులనుగురించిగాని, ప్రజలయార్థికస్థితినిగూర్చిగాని ఏమితెలిసికోనవలెనన్నను, పాల కులకును, పాలితులకును యిదియేశరణ్యము

## ఇతరకృతులు

1900వ సంవత్సరములో "ఇండియాలో కరువులు" అను వది ప్రకటింపబడెను ఇందు ప్రతి సంవత్సరము క్షామమువచ్చి జనులెట్లునశించుచున్నదియు, దానిని వారించుటకు ఉపాయ ములును వివరింపబడెను, "The lays of ancient India" (1893) అను దానియందు సంస్కృతకవుల గ్రంథముల లోని నీతివాక్య రత్నావళులు కింగ్లీషు పద్యములు కలవు, 'పూర్వహిందూదేశము' అను పెరుతో హిందూదేశచరిత్ర కొద్దిలో రచించబడెను, 'ఇంగ్లండు అండు ఇండియా'

(England and India) అను పేరుతో నీరెండు దేశముల స్థితిగతులను విమర్శించుచు 1897 లో నొక గ్రంథము వెలువరెను

ఇట్లు తానడనుభవమును ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ, సంస్కృతము, బంగాళీభాషలయందు తనకుగల పాండిత్యమును ఇతరులవలె మాటలతో పోనీయక తరతరములవారు తెలంచి కొనుచుండునట్లు రమేశచంద్రుడు గొప్పగ్రంథములను వ్రాసి కర్తకాయుడయ్యెను ఆతనికింగ్లీషుయందున్న యుంగ్లీ ప్రాయముగా నుండెను ఇంగ్లీషు స్వభాషగాఁగలవారు గూడ ఈతని శైలికిని, రచనా విధానమునకును, మిక్కిలి అచ్చెరువందుచుండిరి ఈతని కృతులన్నిటి యందును ఇతని ప్రాచీన హైందవసభ్యత భారత రామాయణములు, ఆర్థిక చరిత్రము ఈ మూఁడును హైందవులకొఱకు హైందవునిచె వ్రాయఁబడెనందున జాత్యాభ్యుదయమునకు ఎక్కువగా తోడ్పడఁగలవు భారతగ్రంథమాలిక యందు నీగ్రంథరత్నములు దేదీప్యముగ ప్రకాశించుచుండును

## సంఘసంస్కరణాభిప్రాయములు

ప్రస్తుతమాచరణలోనున్న దురాచారములన్నియు ప్రాచీనగ్రంథములలోని సూక్తానుసారములేయని నమ్మి ప్రాచీనమన్న దానినెల్ల సంఘసంస్కరణ పరాయణులు సేవగించుచు సర్వము పాశ్చాత్యులనుండియె నేర్చుకోవలెనను యూహాలు ప్రబలియుండిన కాలములో రమేశచంద్రుడు జీవయాత్ర మొదలిడెను సమస్త జ్ఞానభాండారములగు ఋగ్వేదము

బైబిలు మొదలగు గ్రంథముల నన్నిటిని విమర్శనపూర్వకముగ చదివి వానియందెంతో గౌరవభావమును కలిగియుండెను ఋగ్వేదమును బంగాళిలోనికి భాషాంతరము చేయుటయు పూర్వులయందును, పూర్వకట్టడములయందును, వారియాచార వ్యవహారములయందును సద్భావము కలిగి అందలి మంచి నంతను తనగ్రంథములయందు జొనుపుటయు, వారిని కించిత్తైనను ఎత్తిదూపంచకుంటయు జూచి మనవార లతని శుద్ధపరమఛాందస పూర్వాచార పరాయణునిగా భావించిరి కాని యాతని జీవితమును బాగుగ పరిశీలించిన వారికి పూర్వ పాశ్చాత్యాచార సమ్మేళనమునకై యవతరించిన గొప్పసంఘ సంస్కర్తయని స్ఫురించక మానదు తాను సముద్రయానము చేసి, భారతేతరులతో సహపంక్తిని భోంచేసెను, తనకొడుకు అజయచంద్రదత్తున కొక వితంతువునిచ్చి పరిణయము చేసెను తనకొమార్తెల రెండవదాని రజస్వలానంతరము వివాహము చేసెను గ్రంథవిస్తరభీతిచే నీచిన్న పుస్తకమునందు ఈవిషయమును గూర్చి వివరించజాలము 'సరళ' యను మూడవ కుమార్తెను వరించిన జె. ఎన్. గుప్తగారికి వివాహోత్పూర్వము వ్రాసిన లేఖలోని కొన్ని వాక్యము లిచ్చుట వ్రాయుట సమంజస మని యట్లు చేయుచున్నాము —

'నీ సందేశమును విని మిగుల నానందించితిని నేను నిన్ను ఇంగ్లండునందు మొట్టమొదట చూచిననాటనుండియు నీయందు సద్భావమును కలిగియుంటిని నేను నీకొసంప్రతించ లేకపోయినను నీయభిప్రాయముల నెక్కువగౌరవించియుంటిని.

వయసునపెద్దవాడ నను స్వాతంత్ర్యమువహించి నీ యుద్దేశ ములకొన్నిసారు లాక్షేపించినను, నీఋజువర్తనమును, నీనిష్ఠా పట్యమును, నీదేశాభిమానమును మెచ్చుకొని యుంటిని ఇవి యన్నియు నీకు తెలిసినవిషయములే నీ యభిలాషమునకు నేను మనఃపూర్వకముగ సమ్మతించుచున్నాను నే నీ విషయమును గూర్చి ముచ్చటించినప్పుడు నాభార్యయు తన యంగీకార మును దెలుపు నచుట కెంతమాత్రమును సందేహము లేదు ఇంత కంటెదగ్గఱ సంబంధముచే మనము పెనవేయఁబడినపుడు నీ జీవితకాలము నందు నేను కొంత సహాయకారి నగుదు నని తలంచెదను

నీవుప్రాయశ్చిత్తము చేయించుకొని యోగ్యుల యెదుట అమర్యాదను పొందుటకు నీజనకుఁడు సమ్మతించఁగూడ దని నీవు తలంచుట సరియే నీవు దీనిని చేయుటకు తిరస్కరించుటయే గాక నీ సహధర్మచారిణి నేర్పాటు చేసికొనుట యందును నీ యిష్టాయిష్టములనే గమనింపఁ గోరుచున్నావు అయినను ఈ సునిశ్చితమువలెనే నీ జనకుని సమ్మతిపఱచి, పితాపుత్రుల కుండు ప్రేమను నిలుపుటకుఁగూడ నీవుప్రయత్నించవలెను దీనిని నెరవేర్చుటయందు నీ పతి నీకు సహాయముచేయవలెను ఆమెఅత్తమామలయెడ వినయవిధేయతయు, గౌరవమును కలిగి యుండవలెను, అత్తమామల విషయములో హిందువుల ఆచార ముల ప్రకారము తప్పక యనువర్తించవలెను అత్తమామ లను కలిగియున్న నా యితరకొమార్తె లిట్లుచేతురు —వారు వారియెదుట ముసుకువేసికొ నెదరు వారితో నెప్పుడును ఎదుటఁ

బడి మాటాడరు వారిపాదములుముట్టి నమస్కారముచేతురు తమ భర్తల జననీజనకులను గౌరవించుటయందు హైందవా చార పద్ధతులను అవలంబింతురు నాకదియిష్టము పూర్వహిం ద్వాచారములను వదలుటచే యీకొద్దివిషయములలో పెద్ద వాండ్ర మనసుల నొప్పించుట మనకు బాధ్యముకాదు మనము దేనినైనను నొక సదుద్దేశముతో చేయఁబూనినప్పుడు మాత్రమే వారినుండి మనము వేరయ్యెదము అంతరాత్మప్రకారము వర్ణాంతర వివాహములు మన విద్యుక్తధర్మము ఏలయన, వేలు వేలై ప్రవేశించియున్న జాతిని తిరిగి యది నేకముచేయును మఱియు హిందూ మహాసంఘమునందు మన దొక చిన్న భాగము అందునిది ముందుబోవుసైన్యము వంటిది ఆ గొప్ప హిందూసంఘము మనసారియొప్పికొని అనుసరించు నటుల మన మా ధర్మమును (వితంతూద్వాహము మొదలగు వానిని కూడ) మన చిన్న సంఘమునందు, మెలకువతో శాస్త్రీ య్యముచేయవలెను నే నిన్ని సంవత్సరములనుండి దీని కొంత చింతించితినో నుడువఁజాలను ఇదివఱలో వ్రాసిన నారెండు నవలలయందును 'సంసార' అనునది వితంతూద్వాహమున గూర్చియు, 'సాహిత్య' పత్రికయందు కొన్ని ప్రకరణములు మాత్రమే ప్రకటింపఁబడిన 'సమాజ్' అనునది వర్ణాంతర వివా హములను గూర్చియు అనుకూలముగ బోధించుచుండును"

## ఉపసంహారము

ఉత్తమోత్తమునుగు మానవజన్మమం దెవ్వఁడును సకలక ప్రవీణుఁడై మెలంగుట దుష్కరము ధన ముండిన

డదు విద్యయుండిన ధన ముండద ఈ రెండు గున్న సౌశీల్య ముండదు ఒకనికి రాజసన్మానము కలుగును మరియొకనికి లోకమాన్యము లభించును ఒకఁడు తన కవితాప్రాగల్భ్యముచేత లోకమును రంజించును మరియొకఁడు వాగ్ధాటిచే ప్రజలమనంబుల నాకర్షించును రాజకీయవిషయము లన్నొకఁడు చెవి కోసికొనును సాంఘికవిషయము లన్న మరియొకఁడు మండంజ వేయును కొందఱకు పరిశ్రమలు ప్రియతమములు మఱికొందఱకు వేదాంతసూక్తులు అత్యంతప్రియములు కొందఱికి గాత్రత్వమబ్బును మరికొందఱికి పాండిత్యము లభించును కాని శ్రీయుత బాబు రమేశచంద్రున కన్నిటియందును ప్రవేశము కలిగి, వాని నన్నిటియందును సంపూర్ణజయము నొందుట అత్యద్భుతముగదా? ఉత్తమపరిపాలకుఁడనియు, సంస్కృతాంగ్లేయ వంగభాషా విశారదుఁడనియు, చరిత్రకారుఁడనియు, నిజమైన దేశభక్తుఁడనియు, సుగుణగణాలంకారుఁడనియు, భరతమాత ముద్దుబిడ్డఁడనియు, సంఘసంస్కరణదక్షుఁడనియు ప్రఖ్యాతిచెంది దృఢమైనధైర్యము, విడువనిప్రయత్నము, అంతశ్శక్తియందలి నమ్మకము మొదలగు కార్యసాధనోపకరణములకు ఆలవాలమైన రమేశచంద్రుని గంభీర జీవితమును హద్దిలో వర్ణించ సాహసించితిమిగాని మేము చేసినది చాలదు ఇంత నుడివిన తరువాత నీ పురుషసింహుని జీవితమందఱి కాదర్శకమనియు అనుసరణీయ మనియు వేఱుగఁ జెప్పవలెనా?

# ఉద్బోధన

సీ॥ "తనదుర్గతినిబాపు ♦ కొనఁగ భారతమాత
కన్న కాన్పుగ వాసిఁ ♦ గన్నబిడ్డ
భారతీయులకడఁ ♦ బ్రభుశక్తి లేదన్న
యపవాదఁబాపిన ♦ యట్టిదిట్ట
ప్రజలయందనురక్తి ♦ ప్రభువులందాసక్తి
ననుపమంబుగఁజూపి ♦ నట్టి జాణ
గిగనాటిపోయిన ♦ దేశాభిమానంబు
పునరుద్ధరింపమే ♦ కొనిన ప్రోడ

గీ॥ క్షితినడుచు స్వప్రయత్నసం ♦ సిద్ధికొఱకు
దైవమును సంఘటింపంగఁ ♦ దలఁచి యుకి
నేఁగుమన్నాఁడనంగ ర ♦ మేశచంద్ర
దత్తుఁ డస్తంగతుండయ్యె ♦ ధరణినుండి"

సీ॥ ప్రజలకష్టములెల్లఁ ♦ బ్రభులకుఁ దెలుపంగ
వారి భాషనుకృతుల్ ♦ వ్రాసినాఁడు
ప్రభుదేశస్థితుల్ ♦ ప్రజలకుఁ దెలియంగ
మాతృభాషను కృతుల్ ♦ మనిచినాఁడు
ప్రజలపక్షముఁబూని ♦ ప్రభువుఁ కడకేగి
తివిరికార్యంబు సా ♦ ధించినాఁడు
ప్రజలచెంతనుజేరి ♦ ప్రభులచిక్కులనెల్లఁ
జాతుర్యముగ బోధ ♦ సలిపినాఁడు

గీ॥ ఉభయపక్షంబులను నీతి ♦ నొక్కరీతి
నెరపయత్నించి నెగడిన ♦ నిపుణులందు
సాటిగల రెండ్రు హిందు దే ♦ శంబునందుఁ
గన రమేశున కాతఁడొ ♦ క్కండె కాక"

సీ॥ "సంఘసంస్కరణంబు ♦ జరిగెడుపట్టున
          తవ విమర్శనమె ని ♦ దర్శనంబు
దొరతనంబునను సం ♦ స్కరణంబు జరుగుచో
          భవదుపదేశంబె ♦ ప్రాణపదము
ఆత్మదేశస్థితు ♦ లరయఁబూనెడు నెడ
          భవదీయవాక్యంబె ♦ పరమగురువు
వ్యవహారిక ప్రజ్ఞఁ ♦ బరికించి కనుచోట
          తావకప్రజ్ఞయే ♦ దర్పణంబు

గీ॥ భరతఖండంబు నభివృద్ధి ♦ పఱచునెడల
పాలకులకైన లోకుల ♦ పాలికైన
నీదువచన ప్రమాణంబె ♦ నియతి యయ్యె
దేశసద్భక్తి సాంద్ర ! ర ♦ మేశచంద్ర !

సీ॥ "మితవాదులనుజేరి ♦ యతివాదపక్షంబు
          త్రెగనాడి కలహించి ♦ తిరుగలేదు
అతివాదులను జేరి ♦ మితవాదనీతి స
          న్న్యాసనీతి యని పో ♦ రాడలేదు
రాజవిద్రోహ కా ♦ ర్యములు జేసెడివారి
          జాడయైనను కంటఁ ♦ జూడలేదు
ప్రభుపక్షమునజేరి ♦ ప్రజలను ఒద్రోసి
          దొరల నీ వెపుడుఁ ♦ జరపలేదు

గీ॥ సర్వసమముగఁ బ్రభుప్రజా ♦ సమ్మతముగ
మాతృదేశోద్ధరణమె ♦ గమ్యముగఁ జేసి
స్వస్థతను ధాత్రిఁ బొందిన ♦ స్వచ్ఛమతికి
నీవు స్వస్థతఘనమె ! ర ♦ మేశచంద్ర !

సీ॥ ఊహవచ్చిననాఁటి నుండియు నొకకీర్తి
కడుమేలిపనిఁగన్న కలమువిడిచి
వయసు వచ్చినదాది వర్ధంపనెంచి ప్రే
మించిన జన్మభూమిని త్యజించి
ప్రభుతయిచ్చినది ప్రా రంభించి సోదర
భావంబునను గాంచు ప్రజలనీడి
ఆదినుండియు భవ గాలోచనమొనర్న
చిరకీర్తియుతు సయా జీని విడిచి

గీ॥ ముద్దుగుతునిఁగను నార్య భూమివిడిచి
తోడఁబాసేయు దే భక్తులను విడచి-
స్వర్గసుఖమునఁగాంటిఁబో గను నటయ్య
దేశసద్భక్తిసాంద్ర! ర మేశచంద్ర!!

తల్లాప్రగడ - సూర్యనారాయణరావు

———

Dowden & Co Madras